# సుభద్రా కల్యాణము



నాటకము



రచయిత,

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి.

శ్రీ శివాభ్యాన్నమః.

# సుభద్రా కల్యాణము

(నాటకము)






రచయిత

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి.



సికిందాబ్రాదు శివాజి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రెండవ కూర్పు 500 ప్రతులు.

1946






[వెల 1–4–0 బి. జి.

# పీఠిక.



ఇప్పటికి సుమారు ముప్పదియైదేండ్ల క్రింద, అనఁగా, నేను గవనమల్లుటకుఁ బ్రారంభించిన వెనువెంటనే యొక నాటకసమాజమువారిచేఁ బ్రేరింపఁబడి యీ నాటకము నెట్లో చాపలంబున వ్రాసితిని. అంతఁ గొన్నినాళ్ళకే కొందఱు మిత్రులద్దాని నచ్చునకుఁ దెచ్చి ముద్రిపించిరి. కవనము పరిపాకదశ నొందకమున్నె, యిద్దాని రచించుటచే నందందుఁ గవనంబుదోసంగులు పొసంగినవి. వీనితోఁ బాటచ్చుతప్పులు మఱియు వెల్లివిరిసినవి. నేఁటికి శ్రీపరమేశ్వరానుగ్రహముచే రెండవ కూర్పు సంఘటించుటచే నిందుఁగవనంబు దోసంగులను నచ్చుతప్పులను జాల భాగము సవరించి యచ్చొత్తించితిని. ఇందుఁగూడ గన్నులుఁగప్పి కొన్ని యచ్చుతప్పులు చేరినవి. తొలినాఁటి కవనఁబగుటఁ గవనంబు దోసంబులుగూడఁగొన్ని మిగిలి యున్నవేమో. పరిశీలకు లారసి యెఱింగించినఁ గృతజ్ఞతతో నవ్వాని మున్ముందు దిద్దుకొనియెదను. అచ్చుతప్పులను శుద్ధపత్రికలో సవరించుచున్నాను.

ఇఁక నీనాఁటికి, అకారణకారుణికులై శ్రీమద్రాసు విశ్వవిద్యాలయమువారు వాత్సల్యముతో నీనాటకంబు నాంధ్రవిద్వత్పట్ట విద్యాపఠనీయ గ్రంథముగఁ గైకొని యనుగ్రహించినందులకు వారికనేక కృతజ్ఞతాపూర్వకాభివందనంబుల సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు,

విద్వత్కవి విధేయుఁడు,

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు

| | | అంకములు. |
|---|---|---|
| ౧ | ధర్మరాజు | ౧ |
| ౨ | భీముఁడు | ౧ |
| ౩ | అర్జునుఁడు | ౧, ౨, ౩, ౪, ౬ |
| ౪ | నకులుఁడు | ౧ |
| ౫ | సహదేవుఁడు | ౧ |
| ౬ | విశారదుఁడు | ౧, ౨, ౩ |
| ౭ | మైత్రేయుఁడు | ౨, ౩ |
| ౮ | శారదాముఖుఁడు | ౨ |
| ౯ | మాధవదీక్షితుఁడు | ౨ |
| ౧౦ | బలరాముఁడు | ౩, ౬ |
| ౧౧ | కృష్ణుఁడు | ౩, ౬ |
| ౧౨ | సుముఖుఁడు | ౫ |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| ౧ | ఉలూపి | ౨ |
| ౨ | నిపుణిక | ౨ |
| ౩ | సుభద్ర | ౪, ౫, ౬ |
| ౪ | మధుకరిక | ౪ |
| ౫ | మాలతిక | ౪ |
| ౬ | సత్యభామ | ౫ |
| ౭ | లక్షణ | ౫ |


ఈపుస్తకమువలయువారు యీక్రిందివిలాసమునఁ బడయఁగలరు,

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి,

నెం॥ ~~45, సత్యనారాయణ గుడి వీధి,~~

శికిందాబాద్—దక్కన్.

# శుద్ధపత్రిక

| పుటసంఖ్య | బంతి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 5 | 10 | ప్రవీణుడు | ప్రవీణుఁడు |
| 13 | 7 | కోరుట కోరుట | కోరుట |
| 13 | 26 | భజించు | భజించుమ |
| 28 | 7 | మోదుకొనుము | మోదుకొనును |
| 29 | 24 | సంఘములారా ! | సంఘములార ! |
| 32 | 20 | వాఅందరు | వారందఱు |
| 38 | 6 | చెల్లెసి | చెల్లెలి |
| 41 | 4 | గోదవా | గోదవా ? |
| 43 | 4 | సిత్రిశాల | సత్రిశాల |
| 48 | 11 | వెక్కుఁడ | వెక్కిఁడ |
| 67 | 6 | నాలి | నాళీ |
| 77 | 3 | పెరుఁగు | పెరుగుఁచు |
| 85 | 6 | సైని | సైనిక |
| 9 | 13 | హోమము | హోమకము ---లు. |
| 33 | 2 | భాగ్యధనంబు | భాగ్యఫలంబు |
| 43 | 5 | భూభుజాగార | భూవరాగార |
| 51 | 16 | నరులనేల | నరునేల |
| 57 | 23 | తంబునన్ | తంబుననన్ |
| 58 | 1 | ను- | ను-భూ |
| 73 | 6 | విభముగ | విభవముగ |
| 82 | 6 | భేద | భేదా |
| 92 | 14 | చెలువొంద్రుత | చెలువారుత |
| 84 | 16 | వశిష్ఠాది ముల్క్ | వశిష్ఠప్రముఖు-లన్క్ |



శ్రీ శివాభ్యాన్నమః
శ్రీమహాగణపతయేనమః
శ్రీశారదాంబాయైనమః

# సుభద్రా కల్యాణము

ఉ॥ శ్రీమదఖండవిష్టపవి ♦ శిష్టభరావహుఁడయ్యు భిక్షుక
గ్రామణియై నిరస్తసుమ ♦ కాంతుఁడునయ్యు మహీధరాత్మజా
స్వామియునై సమస్తజన ♦ సన్నుతులొందుచునున్న రాజచూ
డామణి సేయుఁగావుత దృ ♦ ఢంపు ముదంబును మీకునిచ్చలున్॥

సూత్రధారుఁడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి తెరలోపలి సంగీతము నాలకించుట నటించి) ఏమీ కలనాదము? సంగీతమా! నాశిష్యులును శిష్యురాండ్రును జంత్రగాత్రంబుల మేళగించి హాయిగఁబాడుచున్నారు.

ఉ॥ తంతులమేళగించి విహి ♦ తమ్ముగ గాత్రముతోడజంత్రమున్
బొంతనచేసి రాగమున ♦ పూర్వముగా వెలయించితాళమ
త్యంతముగ్రాలగీతికను ♦ హాయిగ గానముసేయుచుండ న
ల్లంతదగన్ గరంగెడుఁగ ♦ దా పుడమిన్ బొలుపొప్పు రాలునున్॥

వాణియు నీ సంగీతంబు నారసఘనంబగు సాహిత్యంబుతో దీటుగ నెంచియే తాఁ జనుగవగ ధరించినది.

సీ॥ రమణీయవల్లకీ ♦ రాగచారుతరంబు,మృదులశయ్యాలతా। మేళకంబు
కమనీయకిన్నరీ ♦ గానాభిరామంబు, లలితరీతికిసాల ♦ విలసితంబు

సాంద్రఘనాలింగ్య ♦ చటులతరనదంబు, సరసవృత్తికుసుమ ♦ సంకులంబు
తతసంగతక్రమ ♦ తాళవిస్తారంబు, మధురపాకమరంద ♦ మంజులంబు

తే॥ గీ॥ నైన సంగీతమును హృద్య ♦ మైతనర్చు
నాయలంకృతిశాస్త్రము నానెసంగు।
గిరియుగంబును విజపయో ♦ ధరయుగముగ।
దాల్చి రసములనిడు నల్వ ♦ దయుత, మహిత

కావుననే యీసంగీతమ్మున నిమ్మహాజనులిందుఁ జిత్రితప్రతిమల భంగి నిశ్చలులై హాయినొంది యున్నారు. (కలయఁజూచి) ఆహా మహాజనభూయిష్ఠంబగు నీ సభాభ్యుదయంబు గణ్యంబు

తే॥ గీ॥ రాజితాజాత శాత్రవా ♦ గ్రగజయుతంబు
భవ్యయమభీమనర నేత్ర ♦ బంధురంబు
అర్వ్యాసుకలాధికవిశార ♦ దార్యపాద
జాతమలరెను మిగుల స ♦ భాతలంబు॥

ఇట్టియెడ నొక నూతననాటక ప్రదర్శనంబున నీ సభ్యులకుం బ్రమోదము రచించి నేఁ గృతార్థుండ నయ్యెదను. (తెరవంకఁజూచి) ఆర్యురాలా!

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్ర! ఇదిగోవచ్చితిని. ఏమి సెలవు?

సూత్ర—నేఁడు మన రంగమందిరంబునకరుదెంచిన సభ్యులఁ గాంచితివా?

నటి—(కలయఁజూచి) కాంచితి నందఱుఁ గవులును బండితులునై యున్నారు.

సూత్ర—వీరిని రంజించు నాటకంబొకటి యోజింపుము.

నటి—ఆర్యపుత్రా! మాయన్న విజయవర్మ తీర్థయాత్రాగతి విని మా ముద్దుచెల్లెలు భద్రాంగి తన పెండ్లి దూరంబయ్యెనని మిగులవగలఁ బొగలియుండ విజయవర్మ సత్వరంబుగ రాఁగలఁడనియును ననోన్యస్వరక్తులగు మీ యిరువురకుఁ గల్యాణము తప్పక కాఁగలదని

యునఁ జెప్పి నా మేధనంతయు నుపయోగించి యామెం దేర్చివచ్చి తిని. దాన నా మనము శ్రాంతంబగుట నించుక యోజించి

(అను అర్ధోక్తిలో)

సూ—బుద్ధిమంతురాలా! ఇఁక నేమి యోజించెదవు ఉత్క్రాంశమున నే నాయభిమతంబును సూచించి నామనంబును గూడ దేల్చితివి. ఇఁక నే నిపుడు నవరసభరితమగు సుభద్రాకల్యాణ నాటకంబును బ్రదర్శించెదను.

నటి—ఆ నాటకం బేకవి రచియించె?

సూ—ఉ॥ విశ్వజనీన పండితకవి♦స్తుత తిర్పతి వేంకటేశ సూ
రీశ్వర శిష్యుఁడుఁ సరస♦హృద్యవచోరచనాప్రవీణుడుఁ
శశ్వదుమామహేశపద♦సారసభక్తుఁడునైన నాగపీ
రేశ్వరశాస్త్రి దీనిఁగలి♦కీవిరచించె బుధుల్ బళీయనన్॥

నటి—అత్యంతాధునికంబగు నిక్కవికృతి రసాస్వాదనిపుణులగు నీసభ్యులను రంజింపఁ గలదా?

సూ—క॥ ఆధునికమనఁ జిరంతన
సాధితమన నే మిఁకన్ ర ♦ సమునకె యొందున్
ప్రాధాన్యం బీకావ్యం
బాధారము నవరసముల ♦ కరయఁగవలదే॥

అదియునుగాక

తే॥ గీ॥ "వరగుణాలంకృతులు రస ♦ భరితకావ్య
రంజితములగు రసము స్ఫు ♦ రత్పదార్థ
విలసితంబగు నవికీర్తి ♦ విమలచరితు
నేతఁగాంచినఁ దముదామె ♦ నెగడుఁగృతుల"॥

అనెడు కవితల్లజుల యనుశాసనము చొప్పున నుత్తమనాయకప్రతిపాదకంబగు నీ నాటకంబు రసజ్ఞులను రంజించుటకు సందియములేదు. ఇఁక నొక్కింత నీ సంగీత కౌశలంబుఁ జూపుము,

నటి—ఏఋతువు ననుసరించి పాడవలయును!

సూ—కనులకుఁ గట్టినట్లగుపడుచున్న వసంతఋతువుండ నొండొక దాని నేల?

నటి—తే॥ గీ॥ కాంచుమా! సమవర్ణముల్ ♦ కాకపికము
లైన కాకము హైన్యంబు ♦ నందఁబికము
భారతీవైభవోద్దామ ♦ పాటవమునఁ
బడసెఁగీర్తి సుభద్రాప్తి ♦ నొడికముగను॥

మఱియును,

ఉ॥ బాగుగ రాగసంపదవి ♦ భాసిలఁగాఁ జిగిరించి తావులన్
మూఁగఁగఁజేయఁగా నెసఁగు ♦ మొగ్గలనుందగి పూఁచి భోగ్యలీ
లాగరిమంబునందనరు ♦ లాలితమాలతి కర్హ శాఖిసం
యోగముఁ గూర్చు మాధవుని♦యోగ్యత శ్లాఘ్యముగాదెయేరికిన్॥

సూ—చెలీ! బాగుగఁ బాడితివి ఇఁక నాటక ప్రయోగంబునం దించుకేనిఁ బ్రమాదము కలుగకుండఁగా నాకుఁ దోడ్పడి యుండుము. ప్రమాదముఁ గొంటిమేని భరతవంశంబున కపయశంబునార్జింతుము సుమీ.

నటి—తే॥ గీ॥ వినుము భరతాన్వవాయము ♦ విమలకీర్తి
ఘనము నయశాస్త్రసంవిదా ♦ కరము సమయ
సముచితకలాప్రయోగ కు ♦ శలము సఖుఁడ!
దాని కపకీర్తి గల్గదు ♦ తగదుచింత॥

(తెరలో)

కుశీలవసీమంతినీ ♦ చక్కఁగ వక్కాణించితివి. ఇందునకే కదా.

చ॥ అపయశమించుకైన భర ♦ తాన్వయ మొందకయుండుఁగాకయం
చపరిమితానురాగమున ♦ హాయనకాలము తీర్థయాత్ర నే
నిపు డొనరింపఁగాఁ గడఁగి ♦ యేకదతైర్థికవేష మొంది నీ
తిపదులకగ్రజాతులకుఁ ♦ దెల్పఁగఁ బోవుచునుంటి నిట్టులన్॥

సూ—కాంతా! నీతమ్ముఁడప్పుడె యర్జున వేషంబు ధరించి సఖునితోఁ బ్రవేశించుచున్నాఁడు. మన మిఁకఁ బోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

(అర్జునుఁడు యథోక్తవేషముగా మిత్రునితోఁ బ్రవేశించి)

మిత్రమా! విశారదా! వింటివిగదా! కుశీలవులవచనంబులు లోకులకు మనవంశమం దింత విశ్వాసంబుండినపుడు మనమిట్లె దానినిఁ బోషింప వలయునుగదా.

విశా—అవునిట్లే! లోకులకును నిట్టి మీ చరిత్రింబే యట్టి గట్టినమ్మిక నిడుచున్నది.

తే॥ గీ॥ మీరలిటుధర్మమార్గంపు ♦ సారమెఱిఁగి
యుంటచేఁగద జగమట్టి ♦ యూహఁగొనుట
తండ్రియైననుదప్పుడు ♦ దారిఁబోవు
వానిఁగనిరోయరేయెందు ♦ వసుమతీశ!॥

అర్జు—మిత్రమా! ఆ విశ్వాసమునకుఁ గారణభూతుఁడు మాయగ్రజుం డని తెలియుము.

చ॥ కరము ప్రజానురంజకము ♦ గా నిల నేలుచునున్న మేటియె
వ్వరికయినన్ రిపుండనెడు ♦ వాదునుగాంచని పుణ్యశాలి ద
బ్బఱయిసుమంతయేనిఁ బొర ♦ పాటున నైతము పల్కనట్టి ధ
ర్మరతుఁడు పాండవాగ్రజుఁడు ♦ రాజ్యము సేయఁగ వేఱువోఁచునే॥

తే॥ గీ॥ కడుపు చల్లఁగనక్కుంతి ♦ గాంచినట్టి
కానుపున నెవ్వఁడెక్కువ ♦ యైనకీర్తిఁ
గాంచెనాధన్యుఁడాపుణ్య ♦ గణ్యగుణుఁడు
భరతకులభూషణంబయి ♦ పరఁగుఁగాదె॥

విశా—మిత్రమా! యిందిఁకఁ దక్కువవారెవ్వరు?

చ॥ రిపుజనభీముఁడొక్కఁడు మ ♦ హిన్నతిశూరులమెప్పుఁగొన్న శౌ
ర్యపరుఁడు సవ్యసాచియొకఁ ♦ డాహవ రంగయముల్ మఱిర్వురున్

కృపకునిధానమై కడిఁది ◆ కీర్తికిగీమయి రాజరాజులం
దపచితిఁ గొన్న పాండునకు ◆ నల్పులు పుత్రులుగాఁ దనర్తురే?॥

అర్జు—సఖా! మాయన్నగారు సోదరులతోఁ గొల్వుఁదీర్చి యుందురు. మనమింక సత్వరంబుగ నటకేఁగవలయును.

(పరిక్రమింతురు)

ధర్మరాజు—(భీమనకులసహదేవులతోఁ గొల్వుఁదీర్చియుండును.)
(తనలో)

మ॥ మనమా! దుష్టపథంబుఁ గాంచకుమ! ర ◆ మ్మా ధర్మమా! పజ్జకెం
దునయై నన్ బొరపాటు నొందకు మతీ! ◆ దుర్వాదమొక్కింతయున్
గొనకో నాలుక! రాజ్యమా మనుమ! యే ◆ ఘోరంబులున్ లేక! నా
యనుజుల్ గూర్తురుగాక భారతులదీ ◆ వ్యత్కీర్తికభ్యున్నతిన్॥

(కొలువునుఁ జూచి)

ఏమియిది తమ్ములలో నర్జునుఁడు గన్పట్టఁడు అతఁడు కొలఁది దినములనుండియుఁ గొల్వున నొక్కనిమేషంబేని నిల్వక మొకముఁ జూపించి పోవుచున్నాఁడు. ఈదినమున రాక యేచూనె, కారణమేమో గోచరము గాదు, అకటా, తమ్ముఁడు రాకయున్నందున నీ సభ చాల వెలితిగా నున్నది.

చ॥ మురిపపుమోము లేనగవు ◆ మోసము సేయఁగఁ జిన్ని వెన్నెలన్
సరసపుపల్కులాయమృత ◆ సారము సారెకుఁ గేరుచుండఁగాన్
నరయుచు సత్తతిన్ గురుజ ◆ నాప్తతఁ గాంచియుఁ జందమామనున్
నిరసనసేయు నర్జునుఁడు ◆ నెక్కొనకుండిన గోష్ఠియొప్పునే॥

ఇఁక సోదరులయొక్కయు నాయొక్కయు విధంబు విచారింపనేల.

ఆ॥ వె॥ విజయలోకబంధు ◆ విప్రయోగాపన్న
పాండవాస్యపద్మ ◆ పంక్తియిటుల
వికసనంబుదక్క ◆ వెల్లనై యుండుట
యద్భుతంబటంచు ◆ నరయ రెందు॥

ఓహో, ఏమిది, తమ్ముం డెందులకో నేఁడు కొల్వునకు రాకయున్న మాత్రమునకే విప్రయుక్తస్మృతి నొందితిని. తమ్మున కెం దేనిఁ బ్రమాణము కలుగదుకదా.

ఉ॥ రాజులనెల్ల నుగ్రసమ ♦ రంబున గెల్వఁగఁబూని సేనతో
నీ జగమెల్లెడన్ దిరుగ ♦ నెంచి ప్రయాణముఁ జేయునో హరిన్
భ్రాజితసజ్జనున్ బరమ ♦ బాంధవుఁ జూడఁగఁ బోవునో యెటుల్
యోజనసేయరాదిక గు ♦ ణోత్తము నానరు నారయన్ వలెన్॥

అర్జు—[విశారదునితో సమీపించి ధర్మరాజ భీములను గాంచి] అగ్రజులకు జయము.

విశా—ప్రభువులకు జయము.

ధర్మ—(తనలో) పాండవమనంబులతోడ సభాలయంబు ప్రసన్నంబయ్యె. (తేఱిచూచి పరికాశముగా) తమ్ముఁడా! ఏమి యీవేషము?

అర్జు...కీర్తిఘోషము.

ధర్మ...ఎట్లు?

అర్జు...అవధరింపుఁడు. గతదినంబునఁ జోరహృతధేనుండగు నొక బ్రాహ్మణుండాతురతతో రాజమార్గంబుఁ జేరి యీరీతి నెలుగెత్తి వలవింపఁదొడఁగె.

చ॥ చెనటులనెల్లరన్ వెదకి ♦ శిక్షయొనర్చుచునున్న మేటులున్
గనుఁగొని సజ్జనావళినిఁ ♦ గాఁచుచునున్న దయామయాత్ములున్
మునుకొని ధర్మమున్ బుడమిఁ ♦ బోషణసేయుచునున్న పుణ్యులో
యనఘులు భారతుల్! ద్విజుని ♦ యావునుఁ గావఁగఁబూన రేకృపన్॥

ధ...[తనలో] భరతవంశ్యులకీర్తికిఁ గళంకము రాకుండుఁగాక. [పరికాశముగా] అనంతరము.

అర్జు...అనంతరమా భూసురుఁడు రాజమార్గమునుండి యట్లే మొఱలిడుచువచ్చి చేరువ చల్వచప్పరంబుననున్న నన్గాంచి పేరాస నాయుదంతంబంతయు నెఱింగించి తుద కిట్టులనియె.

క॥ సంరంభంబునఁ దస్కరు
సంరోధించి సురభిని నొ ♦ సంగు వరధను
స్సంరావ "దుర్బలస్య బ
లంరాజా" యన వినవె యి ♦ లన్ విదితముగాన్॥

ధర్మ...(ఆతురతతో) అపుడు నీవేమి చేసితివి?

అర్జు...తస్కరుఁడు దవ్వేగుటఁగని యప్పాలున కభయంబొసంగి వేగ ముగఁ బాంచాలీ మందిరంబున కరిగి చాపంబుఁగొనిచని యాదుష్టుం బొలియించి గోరత్నంబును గ్రిమ్మఱ భూదేవున కొసంగితిని.

ధ...నయవేదివగు నీ కిది తగినదే.

అ...అయిన నసమయంబునఁ గృష్ణామందిరప్రవేశము పూర్వనియమ నిరోధకంబయ్యెఁగావునఁబ్రతిజ్ఞాప్రకార మొక్క వత్సరము తీర్థయా త్రన్ జేయ నెంచితిని.

ధ...(తనలో) తెలియఁబడె. తీర్థయాత్రి సేయఁబూనిన తమ్ముని నివా రించుటయును పంపి వియోగము ననుభవించుటయును సమ కష్టంబులే.

క॥ నయమెట్లైనను దమ్ముని
పయనంబున కనిపి పిదపఁ ♦ బ్రతుకం గలనే
నయదూరులు పాండవులను
నయశముఁ గొనఁగలనె యాత్ర ♦ నాఁగి హృదయమా॥

అయిన నిట్లు శాస్త్రరీతిఁ జెప్పెద. (ప్రకాశముగా) తమ్ముఁడా

ఉ॥ ఇంద్రియకాండమందు మన♦మే కరమెక్కుడు గామమోహాయు
త్కిందుప్రపదాత్మజాతవస ♦ తిన్ గ్రమమెంచక చేరరాదటం
చుం డ్రిదశర్షి నారదుని ♦ చోదనఁజేసినబాసకిప్డు ని
స్తంద్రనయుండ! నీదుకృతి ♦ తప్పగునే పరికించినన్ మదిన్.

మఱియును

మ॥ కనఁగా గోపరిపాలనంబు సకలా ♦ ఘధ్వంసకంబందు వి
ప్రునకుంగూడ మహోపకారకమునై ♦ పొల్పారునీయాకృతిన్

ఘనపుణ్యోదయమొందు దక్కనిక నా ♦ కక్కడుండు దోషంబునాఁ
జను నే! యీసుకృతంబు దోషశతముల్ ♦ జక్కాడదే! యుక్కునన్॥

అర్జు... నేనీ మహావిద్వాంసుని నీతివచనంబుల మెప్పించుట దుర్లభము. ఇఁక లౌకికోక్తుల సెలవుఁ గాంచెద.

శా॥ నీతింబారముగా నెఱింగినఘనుల్ ♦ నీబోటు లార్యోత్తముల్
చేతోమోదముగా భవద్వచనముల్ ♦ స్వీకారముల్ జేతు ర
య్యా! తథ్యంబు నెఱుంగనట్టి జనులా ♦ హా! పాండవుల్ పూర్వసం
కేతంబౌనల బాసఁ బాసిరని దు ♦ ష్కీర్తిన్ బొసంగింపరే॥

కావున వేవేగ నానతియిడినఁ బ్రతినఁ జెల్లింపఁబూనెద.

ధ—(తనలో) ఇఁక నేమిచెప్పినను ప్రయాణమును మానఁడు. (ప్రకాశముగా)

ఉ॥ తమ్ముడ! నీవు పల్కినవి ♦ ధర్మ్మదలంచి భువిన్ జరింపనిన్
సమ్మతితోడఁ బంపనెటు ♦ సాధ్యము దూరతరంబు లెల్ల తీ
ర్థమ్ములు వానిసేవకగుఁ ♦ దద్దయుఁ బ్రొద్దులు వానినేయుపా
యమ్మునఁ బన్నఁగాఁగలనొ ♦ యారసిచెప్పగదయ్య! యొయ్యనన్॥

తే॥ గీ॥ భీమసేనుఁడు నకులుఁడు ♦ పిన్నతమ్ముఁ
డమ్మహాదేవి కుంతియు ♦ యాజ్ఞసేని
యును భవద్విరహంబును ♦ నోర్వఁగలరె
భంజితాహిత సముదాయ! ♦ పాండవేయ!

భీ—తథ్యమే

ఉ॥ చిన్నతనంబునుండి పలు ♦ చింతలవంతలఁ గుందికుంది యీ
మొన్నటినుండికాదె మది ♦ పొందికఁ గంటిమొ లేదొ నేఁటినీ
పన్నికనారయన్ మరలఁ ♦ బొల్పడెఁగష్టమటంచుఁదోఁచెనే
పన్నిదమైన నిద్దెసలఁ ♦ బాయఁగఁజాలమనుంగుతమ్ముఁడా॥

ఇఁక నెవరేని మనసీతివిక్రమం బెఱుంగక దురుక్తులాడుదురని తలఁచితివా? అప్పాపులగుండెలఁ బగుల్తునుజుమీ. ఆపాపులనఁగా నెవ్వరు?

మన కెగ్గుదలంచువారా ధార్తరాష్ట్రి హాతవులేగదా?

కం॥ నీటంబడఁద్రోయించిరి
కూటవిషంబిడిరి కాల • కుండలితతులన్
గాటులనొందించిరి కడుఁ
గాటవుపగలక్కయిలును • గాల్చిరికట్టా॥

కానిమ్ము, కాలజవై గుణ్యంబున వారిం బరాభవింప లేకుందుమా, ఇఁక నిపుడీవు కనికరంబు పీడి మమ్ము దిగనాడి తీర్థయాత్ర సల్పుదు నన్నను.

క॥ రాకాసుధాంశుబింబ
శ్రీకరవదనా! సుధాంబు • సీకరవచనా!
మాకు నిను పీడశక్యము
కాకున్నది యేమిసేయఁ • గలవారమిఁకన్॥

అర్జు—అన్నా! నీకు నేను బదులు చెప్పఁగలనా?

తే॥ గీ॥ నీతిశాస్త్రార్థ వేదివి • నీవు ప్రతిన
బహులబుధసన్నిధినిఁ జేయఁ • బడినది బహు
జనులు నయసూక్ష్మనిర్ణయ•జడులు మార్గ
దర్శకులము మనము మదిఁ • దగవరయుమి॥

నకు—(వినయముతో) అన్నా! ధనంజయ!

క॥ వినుమా! యన్నల పల్కులఁ
గనుమా! శాస్త్రోక్తములను • గా వానిఁ గృపన్
గొనుమా! తమ్ములయెడ మా
చనుమానమ్ముఁ దీర్పవిదియె • సమయంబు సుమా!

అర్జు—(తనలో) అకటా విద్యాబుద్ధులం బ్రాధుడైనను జిన్నతనమునను నాయందలి చెలిమివలనను నను విడఁజాలని యీ నాతమ్ములనెట్లు సమాధానపఱచెద. (నకులునిఁ జూచి ప్రేమతో)

ఉ॥ అన్నల పల్కులందెప్పుడ • నాదరముండదు తమ్ముఁడా! నయం
బున్న తెఱంగునన్ మెలఁగు • నొప్పగు మెప్పగు నెందునన్నలన్
నిన్నను జిన్నతమ్మునిని • నే విడనాడుదునైన యాత్రగా
కున్న మనంబు సంతసము • నొందదు పొందదు కొందలంబునన్॥

సహ—(తనలో) హా యేమిసేయుదు. వలదని తక్కిన నా యన్నలెల్లఁ జెప్పినను వారలకుఁ దగురీతి నుత్తరంబు లొసంగి యాత్రఁ జేయ సమకట్టియున్న నీ యనఘునకు నేనును యాత్ర మానుమని కోరుట కోరుట ప్రయోజనం బావంతయు లేక 'పిష్టపేషణం' బగును. అయినను ఇదపఁ జింతింపకుండుటకుఁగా నిట్లర్థించెదను.

క॥ రాదా! దయ మాయెడ నిటు
వాదా! సోదరులతోడఁ • బగతుఱకుఁ గడున్
గాదా! నగు మనయెడయిక
నీదాపున్ పడఁజాల ? నేనిఁక ననఘా!

అర్జు—(సహదేవునిఁజూచి ప్రేమతో)

ఉ॥ ఒజ్జలకెందునీతి సమ • యోచితరీతి నెఱుంగసేయుదం
చిజ్జనులెల్ల నిన్ను గణి • యింపఁగ నెప్పుడు విందుఁ దండ్రి! ము
న్నజ్జడదారిపంపున ర • యంబునఁజేసిన బాసదాఁటినన్
ముజ్జగమందు పాండవులు • మోఱకులంచపకీర్తి పర్వదే॥

ఇఁకఁబగతుఱు మనయెడఁబాటుఁగని హసించెదరందువా! వినుము.

తే॥ గీ॥ ధర్మశాస్త్రపథంబునఁ • దనరువారిఁ
బగతుఱేకాక పెఱవారు • పరిహసింప
రకట చెడుత్రోవవారల • సకులుదక్క
నందఱిస్సీయనుచుఁ దూల • నాడఁ గలరు॥

ధర్మ—

ఉ॥ మాటికిఁ జెప్పటంత ఘన • మా! చనుమా! కొని నీదు మిత్రులన్
గాటపు పుణ్యభూములను • గాంచి భజించు మించుకూర్మిమై.

హాటకముఁ బురంబుల ♦ ధరామర వర్యులకిమ్మ! వేగ నీ
యేటినిఁబుచ్చిరమ్మ! ముద♦మేర్పడ మామదులందుఁబొందఁగ॥

అర్జు—దేవరయానతిని మాళిఁదాల్చితిని మాన్యంబగు భీమన్నగారి యానతినిఁ గాంచినఁగదా కృతార్థుఁడనగుదును.

భీ—

చ॥ తెలుపఁగ దండగంబుల ని ♦ తాంతముగూర్చుచునుంద్రుమార్చు రె
త్తటి నెట నేని మోసముల ♦ దా కొనకుండఁగదయ్య! సుంతయే
మఱక సఖాళిఁగొల్వఁగ స ♦ మస్తమహీతలపుణ్యభూముల
బిఱబిఱఁజూచివచ్చి మముఁ ♦ బ్రీతులఁజేయఁగదయ్య! తమ్ముఁడా!

అర్జు—కృతార్థుఁడనైతి అన్నలారా! గురుజనాంతఃపురజనమ్మునకీ ప్రయాణము నెఱింగించియే వచ్చితిని. అభివాదనం బొనరించెద.

ధ. భీ—కల్యాణమస్తు.

అ—(నకుల సహదేవులతో) తమ్ములారా! తీర్థయాత్రకేఁగెదను.

న, స...చిత్తము.

వి...భర్తలకు నమస్కరించెద.

ధ. భీ...శుభమగుఁగాక.

ధ...(విశారదునితో) కుమారా! నిరతంబేమఱక విజయునకు సహకారివై యుండుము.

అ, వి...(పరిక్రమించుదురు)

ధ...తమ్ములారా! ఇఁక గొల్వుఁజాలించి విజయయాత్రగతిచే వికలిత స్వాంతయగు కుంతీమహాదేవి నూఱడింతమురండు.

(ధర్మజ భీమ నకుల సహదేవులు నిష్క్రమింతురు)

అ...సఖా! మనచెలికాఁడు మైత్రేయుఁడు తడవేలచేసె.

వి...మనము చెఱువుదగ్గఱకు బోవువఱకతండు మన పరిజనముతోఁ జేరరాఁగలఁడు.

అ...అట్లయిన మనము పోవుదము.

(తనలో) ఓనామనోజ్ఞవాసినీ! సుభద్రా!

ఉ॥ నీదుమనోజ్ఞరేఖలను ♦ నీదువిలాసవికాసభంగులన్
నీదులసత్తనూజ్వలత ♦ నీదుకలాపరిపూర్ణచాతురిన్
నీదుగరిష్ఠశీలమును ♦ నెయ్యుఁడు నాకొకఁడగ్నిమిత్రుఁడన్
భూదివిజుండు దెల్పికర ♦ ముగ్దనరించెఁదలంపునీపయిన్॥
అది మొదలుకొని నేనతనుతాపంబున వేగుచు

చ॥ కలికి మిటారి! నిన్నుఁ గను ♦ గాటపు పేరిమి నేఁడొ రేపొయ
న్నలకడనానతిన్ గొని చ ♦ నందగుద్వారకకంచు నెంచవా
టిలె నిటుపుణ్యభూమిగతి ♦ శ్రీవులకాకరమైన నీదుమేల్
గలకలనవ్వుముద్దుల మొ ♦ గంబుఁ గనుంగొనుభాగ్యమెన్నఁడో॥

చ॥ కురుపతికీయ నిన్ను హలి ♦ గోరెనటంచని వింటినీమనం
బరయఁడతండు పౌరజను ♦ లంత సుభద్రకిరీటిలోలయం
చటిముటిగావచింతురు ధ ♦ రామరుఁడట్టులె చెప్పెనింక సుం
తఱమఱలేకనిర్గొనెద ♦ నగ్గలికన్ సురలెత్తివచ్చినన్॥

ఇఁకను

తే॥ సీ॥ శైశవమునుండి నీయందుఁ ♦ జనువునొంది
మరల భూసురముఖమున ♦ మరులుఁ బొంది
గడియ మదిఁబాయకుండిన♦గట్టిబాళి
వ్రతము ముగిసెడుదాక న ♦ న్వదలుఁగాక॥

(ప్రికా) మిత్రమా! యాత్రారంభమందిష్టదేవతా ధ్యానం బావశ్యకము.

మత్తకోకిల॥ గోపికానటనాభినందితు ♦ గోపవేషవిరాజితున్
గోపతిస్తుతపూతవర్తనుఁ ♦ గుత్సితోరగమర్దనున్
బాపభంజన పాదపంకజుఁ ♦ బాలితాఖిలసుప్రజున్
బ్రాపుఁగోరిభజింతు నే నుప ♦ పన్నభద్రవిధాయకున్॥

(నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



# సుభద్రా కల్యాణము

## ద్వితీయాంకము.

మైత్రేయుఁడు (కన్నులఁ దుడిచికొనుచు నాక్రోశముతోఁ బ్రవేశించి) ఓరీ! ఎవఁడురా నిలుము! నిలుము! ఈబుడిచెంబుదెబ్బతో నీబుఱ్ఱ బ్రద్దలుకావలసినదే, (నలుదిక్కులఁజూచి) ఎవఁడును లేఁడు. బాపిసె కొడుకు పాఱిపోయినాఁడు. అబ్బా యీతొత్తుకొడుకులతో నాకు జావు వచ్చినది. మూఁడవజామైన తిరుగలేదప్పుడె యొకతుంటరివచ్చి చెవి దగ్గఱ ఢామ్మని కేకవేసి ప్రయాణమగుచున్నారు లెమ్ము లెమ్మని యఱచి నానిద్దురఁ జెఱిచిపోయె కన్నులు తెఱవనిచ్చుటలేదు. ఒడలియందు వాఁతఁబెట్టిన సగము మెల్కనెడు నేనీ యడవి పయనముఁ బట్టి పెద్దపులుల బెంగన మోటు నిద్దురం బోవకుండుటఁ జేసి యిట్లు నిద్రాభంగంబు నొందితిని. ఇందులకై వీరల నెన్నితడవలు శిక్షించినను సిగ్గు లేక నన్ను మేల్కొలుప మానరు. ఒక మాఱొకనిని శునకంబువలె కఱచితిని మఱియొకనిని గాడిదవలె నడుములు విఱుగునట్లు తన్నితిని వేఱొకనిని గోతివోలె ఱాల ఱువ్వితిని ప్రయోజనము లేదు నెయ్యానికేని యీ నాతిప్పలు చెప్పిన నతఁడు నన్నే యెగతాళిసేయును గాని వారలను మందలింపఁడు ఈలాఁటి చెనఁటి పయనంబని యెఱిఁగియే బాబో నేను రాను కుయ్యో మొఱ్ఱోయని కేకలిడితిని ఇదిగో తొందరగా మరలవచ్చెదమని చెలికాఁడు తోడుకొనివచ్చె నేనేమి సేయుదును ఇఁక నీయరణ్యంబున నారోదనంబు వినువారెవ్వరు ఇపుడిటనుండి యొక నఁబదెడు గుళ్లుగోపురములుగల కాశికాపురినిఁ జేరుదురఁట అప్పటి

సుమారు నూఱుకోట్ల లింగంబులుండునంట. దానిఁగాంచిన మానిసులకు దోసంబు పీసంబేని యుండదంట పున్నెంబున నటఁ జచ్చినవారెవ్వరేని నిక్కంబుగ శివలింగంబులగుదురంట చెలికానికట మూడునెలలు కాపు రంపాటచే నుండలేకనే నాసరికి లింగంబునగుటకు సందియంబే లేదంట (తూర్పువంకఁజూచి) నిద్రామాంద్యంబున నేనింకను రాత్రియున్నదను కొంటిని తెల్లవాఱువేళయైనదే.

తే॥ గీ॥ కాలపురుష సమాగమ ♦ లీలఁదనిసి
యినుని గర్భమునందాల్చి ♦ యెసఁగుపూర్వ
దిగ్వనిత చూలుచిన్నె చేఁ ♦ జెల్లనయ్యె
ననఁగఁ దూఱుపు తెల్లనై ♦ యతిశయించె.

ఇంతకు నాకీనాఁడు చీవాట్లు రావలసియున్నవి (తెరవంకఁజూచి బిగ్గరగా) ఓరీ వసంతకా! యజమానులు రాజమంత్రులిప్పుడేమి సేయుచున్నారురా! (వినుటనటించి) ఏమనుచున్నావు "మూర్ఖుఁడా! అల్లరుగో బయలుదేరి నీకోసమెదురుసూచుచున్నారు" నియ్యా! అదిగో చకారగుండులకారంభమైనదే. (తెరవంకఁజూచి) తొత్తుకొడుకా! నీకెంతకావరమున్నదిరా! నెమ్మదిగాఁ జెప్పలేవా! (వినుటనటించి) ఏమనుచున్నావు "నీవదరుటకేమిలే వేగిరముగా" రమ్మనియా! మొదలేయట్లు చెప్పరాదా వషట్కారములతోఁగాని బుద్ధికలుగదు ఇదిగో చెలికాండ్రను గలిసికొనియెద.

(అర్జున విశారదులు ప్రవేశింతురు)

మై—(సమీపించి) జయము రాజమంత్రులకు.

వి—(చిఱునవ్వుతో) మైత్రేయా! నిద్ర తెలిసినదా?

మై—ఇంకను బూర్తిగాఁ దెలియలేదు.

వి—నేనెవరినో చెప్పగలవా?

మై—చెప్పకేమి,

వి—ఏదీ! చెప్పుము?

మై—నక్షిముక్కునాగయ్యవుగావా! (నవ్వును)

వి—(నవ్వి) వదరుబోఁతువు.

అ— (మిత్రులతోఁ బరిక్రమించి) మిత్రములారా! ప్రభూతానందరాశి యగు నిక్కాశిం బ్రవేశించితిమి. ఇఁక నిందు జూడుఁడు.

సీ॥ ఎచ్చోటఁ గనిన నే♦ డేసియంతస్థులా, ప్పెడు చప్పరంబులు♦ పెంపుఁ జూపు
ఏదిక్కుఁ జూచిన♦ నీశ్వరాలయ హేమ, తుంగ శృంగంబులు♦ రంగుఁ గడగు
ఏ వైపుఁ గనుఁగొన్న♦ నిందుధరార్చనా, వస్తుశాలలు సుప్ర♦శస్తిఁ దనరు
ఏదిశఁ గనగంగ♦ కేగి తీర్థములాడి, వచ్చు జనుల వ్రాంత♦ భక్తిఁ గొలుపు

తే॥ గీ॥ ఎందువిన వేదనాదమిం♦ కెందువినినఁ
దారకధ్యానమెందు శా♦స్త్రరవంబు
ఏడు జన్మంబులందునఁ♦ గూడుఁగొనిన
పుణ్యఫలమునఁ గంటిమీ♦ మోక్షపురిని॥

(నిరూపించి) ఆహా!

ఉ॥ మేలికడానిపూఁతలును♦ మేలగు మౌక్తికతోరణంబులున్
నీలపు రత్నవేదికల♦ నీటుగఁ దీర్చిన విగ్రహంబులున్
జాలగనున్న యాత్రికుల♦ సందడియుం దగు విశ్వనాథ దే
వాలయరాజ మల్లదియె♦ హర్ష మెసంగఁగఁ జూడుఁడీ సఖుల్!

(సమీపించి) సఖులారా! ఈయాలయద్వారంబున కొక్కమారు దండం బిడి లోపలికిఁ బోవుదము.

(మిత్రులతోఁ బరిక్రమించి విశ్వనాథలింగంబుఁ గాంచి సంతోషముతో)

అర్జు— శా॥ కాశీ యస్యసధర్మిణీ సకలలోకాళీ సముజ్జీవినీ
స్కందోయస్య సుతస్సురేంద్రతనయా నందాను సంధాయకః
శేషోయస్య సహస్రమౌళికిరణో న్మేషో లసద్భూషణం
సోయం విశ్వపతిర్హిమాంశుమకుటో గృహ్ణాతునోవందనం

మందాక్రాంత వృత్తము.

విద్యుద్వర్ణాం విబుధవిసరత్రాణవిస్తారతూర్ణాం
తారాకారస్ఫురదురుమణిస్నిగ్ధ తాటంకకర్ణాం
భక్తాభ్యర్ణాం పరశివతపోయోగతీర్ణా మపర్ణాం
వందే పూర్ణాం కువలయనభోగోళయో రన్నపూర్ణాం

మై—ఓ సామీ!

సీ॥ పుత్తెపెంకులలోన ♦ బోనంబు నొనఁగూర్చి, పులితోలు వల్వఁగాఁ ♦ బొసఁగఁ జేర్చి)

దయ్యాలమూఁకల ♦ నెయ్యంబు నెలకొల్పి, కాటినిఁదగుబసఁ ♦ గాఁగనిల్పి

త్రాఁచుపామునుజన్ని ♦ దంబుగా మెడవైచి, జింకపిల్లనునొక ♦ చేతనుంచి

నలచిమిన్నేటిజ ♦ వ్వనినిఁదలనుండి ♦ కాటిబూదినిమెందు ♦ గానలంది

తే॥ గీ॥ వెలి ముసలియెద్దు మూపెక్కి ♦ విసము మెక్కి

తివిరి యూరూరుఁ దిరుగుచుఁ ♦ దిరిపమెత్తు

దొరవు నీచేఁతలెల్ల నా ♦ కరిదిఁగొలుపు

వలయు దండాలిఁగొనుము నీ ♦ వాఁడ వినుమ!

[నమస్కరింతురు]

అ—ఇఁకఁ బవిత్రజలవాహినియగు మందాకినిఁ జేరుదమురండు.

[మిత్రులతోఁ బరిక్రమించి గంగనుగాంచి]

చ॥ అలతటినీవతంసఁగనుఁ ♦ డజ్జకిరీటజటావరిష్కృతన్

జలదురువీచికాజనిత ♦ చారు సమీరకిశోరభూషితన్

గలకలకృన్మదభ్రమర ♦ కాంతకుశేశయభూషితన్ సుసం

కులసురసిద్ధసాధ్య నర ♦ గుహ్యకనాగసుతాభిసేవితన్ ॥

[నాగకుమారికలగు సులూపియు నిపుణికయుం బ్రవేశింతురు.]

ని—చ॥ కలువలఁగోయుదానఁ జెవి ♦ కమ్మల జంటకుఁగా సులూపిరో!

ఉ— యలవిరితమ్మిలం జదువు ♦ మమ్మరొ! మారునిఁబూజసేయఁగాఁ

ని— గులుకునడల్ దగన్ జెడఁగుఁ ♦ గుల్కెడు హంసలఁబొంచిపోదమా!

ఉ... జలమునమున్గి రత్నములఁ ♦ జాలగఁదెచ్చితిఁ జూడునెచ్చెలీ!

ని... సఖీ! యిమ్మహోదయపర్వంబునన్ భాగీరథిన్ దీర్థములాడ నేగుదెంచిన నీమనుష్యుల చెయ్వులన్ గాంచుదమిటురమ్ము.

అ... మైత్రేయా! యీసాగరమనోరమన్ గాంచినకొలఁది నామనము నమస్యాప్రవణం బగుచున్నది.

[గంగను నిరీక్షించి.]

అమ్మా! గంగా! నమస్కారము.

క॥ అంగజసూదనవిపులపి
శంగజటారంగ! చారు ♦ సాంద్రనినదచ
క్రాంగరథాంగవతంగా!
భంగముసేయుము! మదీయ ♦ భవములగంగా!

వి...తల్లీ! గంగా! నమస్కారము.

క॥ రంగారుచుందువహ సుత
రంగా! నవవికచపద్మరసలాలససా
రంగా! పరిసరవర్తిక
రంగా! వశవర్తివృషతురంగా! గంగా!

(అర్జునునితో) మిత్రమా! ఇటుకనుము.

ఉ॥ స్నానముఁజేయువారలును ♦ సంధ్యలవార్చెడువారు భూరిగా
దానములిచ్చువారలు సు ♦ ధాకరశేఖరు పూజకై వడిం
బూనిజలంబు బిందియలఁ ♦ బొందుగఁజేకొని పోవువారు గం
గానుతులంచుఁ బద్యములఁ ♦ గౌతుకమొప్పఁ బఠించువారలున్

ఇఁక నిటుఁగనుము.

తే॥ గీ॥ పూలఁ బూజించి గంగఁ గ ♦ ప్పురఁపు టార
తులను బట్టెడు పుణ్యాస ♦ తులును మూసి
వాయనంబుల వృద్ధసు ♦ వాసినులకు
భక్తినిడి మొక్కుచుండు సౌ ♦ భాగ్యవతులు॥

అ...మిత్రమా! యీగంగావైభవంబసామాన్యము.

(నాగకన్నియల నిరువురనుగాంచియందునులూపిని విస్మయముతోఁ బరికించి) (తనలో)

క॥ మెఱుపుందీవియరో! చం
ద్రుధృతరేకయొ! వేల్పుజేని ♦ తోఁట నమరుమేల్
ఖిల్లబంతియొ! మేలిమిబం
గరుబొమ్మయొ! లేక దివ్య ♦ కాంతామణియో!

(నిరూపించి) నిక్కంబుగ నీమనోరమ రామయే యేమియిది తెర్థికర్ర్వ తుఁడనగు నన్నీమనోహరాంగి యొకనిమేషములో భ్రమింపజేసినది ఎవ్వతెయో దీనిపేరెయ్యదియో ఇటకెందుండియరుదెంచినదియో పరికింపనాకారంబున నాగజాతివనితయనితోఁచు కన్నియయో కాక వేలోకని యిల్లాలో తారసించి యాతోడిబోటి నడుగుదునా. అటులమనీషులెఱుంగుగాదు ఉల్లమా! యింకమరలుము. యాత్రికుఁడను.

ఉ...(అర్జునునిఁగాంచి వెఱగుతో)

ఆహా దర్పకుఁగ్రేణిసేయు నీరాజనందనునిఁగాంచినంతనే నాచిత్తంబు మోహాయత్తంబయ్యె ఏలొకొ యనివిచారించిన నేనకాదెందుసుందరులేని నీయందకానిఁగనినఁగ్రందుగ మరులొందుటయందు సందియంబులేదని తోఁచు.

శా॥ బంగారంబునఁ దావిసేకుఱినఁబో ♦ ల్పాఱవచ్చు నెమ్మోనితో
డంగందుఱఁగనకున్న రాజు సరిరాఁ ♦ డా? మోముతోఁబంకమం
దుంగన్పట్టకయున్నఁదామరలు క ♦ న్దోయిఁదగఁబోలునా
సింగంబేగుహఁదాఁగకున్న సరివా ♦ సిఁగాంచు విక్రాంతితో॥

మున్నల దేవమునియగు నారదునిచే విజయుని యాకార రేఖల నాలకించి యవ్వసుమతీకాంతు నాప్రాణకాంతునిఁగ నెంచి కామించి యుంటి. నేఁడు కనఁగ నీరాసుతునియందా విభ్రమంబులన్నియు భాసిల్లు చున్నవి. నాభాగ్యవశంబున నాతఁడే నేఁడిట్లు తారసిల్లియుండు. అట్లు కాకున్న నిర్మలంబగు నాయంతరంగంబు వేఱుకడ భ్రమఁజెందదు. ఇఁక నేనీ సమీపమునందయుండి వీరి పలుకులచే నిక్కంబరయుదాన.

(సఖితోఁ బరిక్రమించును)

అర్జు...మిత్రులారా! నేఁడు జన్మంబులుగల భాగ్యంబుఁగాంచితిమి

తే॥ గీ॥ విమలమోక్షైకనాథు శ్రీ ♦ విశ్వనాథు
నఖిలకల్యాణసంపూర్ణ ♦ నన్నపూర్ణ
సకలనిర్జరగణమాన్య ♦ జహ్నుకన్యఁ
గనుటకన్నను మేటిభా ♦ గ్యంబు గలదె॥

విశా...మిత్రమా! యాత్రికుల నావరించుచున్న నీధాత్రీసురులనుగనుము

శారదాముఖుఁడు...(విసువుతోఁ బ్రవేశించి) అక్కటా

అ॥ వె॥ ఎంతపర్వమైన ♦ నేమి వైదేశిక
జనుఁడనగుట నిచట ♦ గొనఁగఁగలనె
యొక్కకాసు నేని ♦ నూర నున్నట్టి పు
రోహితులవె కాక ♦ రూకలెల్ల ॥

రిక్తుఁడనగుట నిచట నీ దినంబున నా కుటుంబమున కొక్కమాసపు గ్రాసద్రవ్యంబు నార్జింపుమనని వచ్చితిని. అదియంతయు నేఁడు పూర్ణానుస్వారంబైనది కానిమ్ము. దురితనాశనియగు నీజాహ్నవిం గ్రుంకి యిమ్మహాదేవు నారాధించి జన్మంబును బవిత్రంబుఁ జేసికొంటినిగదా అందునకు సంతోషించెద. ఇఁకను గృపాళువును నఖిలజగన్మాతయునగు నన్నపూర్ణాంబ నిఖిలజనంబున కన్నంబిడి రక్షించును అంతకన్నఁ గావలసినదియేమి? పాడుబుద్ధి జన్మభూమిని విడనీయక యిట్లు గారించుచున్నది.

తే॥ గీ॥ జన్మభూవత్సలత యల♦సత యవిరత
కామినీసేవ భీరుత ♦ ఘనరుగార్తి
కృశత మత్తత యనునాఱొ♦గిఁజగంబు
నందుశ్రేయఃపదవికి ద ♦ వ్వైదసర్చు

(దృష్టినించి) అట దూరంబున నిరువురు రాచకొమరులును వారల తోడ నొక విప్రుండును గన్పట్టుచున్నారు వారిని సమీపించెద.

అ॥ వి...[విప్రునిఁగాంచి] అగ్రజన్మా! యభివాదనంబుఁ జేయుచున్నారము

శా...కల్యాణమస్తు. [అర్జునునిఁగని విశారదునితో] కనులపండువుసేయు నీరాజనందనుండే రాజర్షి గోత్రంబు నలంకరించె.

వి...సీ॥ ఎవ్వని పేరిట ♦ నీఖండ మెక్కుడు, కాలమునుండి ప్ర ♦ ఖ్యాతిఁగాంచె
ఎవనిజన్మంబున ♦ నిందువంశము రాజముక్తాఫలోత్పత్తి ♦ మురువుఁదొరసె
ఎవనిపాండురకీర్తి ♦ యే చక్రవాళాద్రి, కందరంబులఁ జంద్రి ♦ కనురచించె
ఎవనియజ్ఞకదంబ ♦ మెల్లభూసురులకు, లేమిడిలేమిఁ గ ♦ ల్పించెజగతి

తే॥ గీ॥ అట్టి శాకుంతలుండు స♦మస్తభూమి
రాజమౌళిగభస్తి స్త్రీ♦రాజితాంఘ్రి
భరతమూర్ధాభిషిక్తుఁడై♦నరనుతునకు
గోత్రకర్త యటంచెఱుం♦గుము ద్విజేంద్ర॥

శా...[సంతోషముతో] మాన్యులగు భారతులకు మఱిమఱి విజయం బగుఁగాక. అటులే నీగుణోత్తముని స్వజనకనామంబుల నెఱింగింపుము

వి...ఉ॥ కుంతికిఁ బాండుభూవరున♦కుఁ గడు గారవపుం గొమారుఁడ
శ్రాంతజితాత్ముఁడౌ నలయ♦జాతవినోధియనుంగువమ్ముఁడౌ
కిట్టింత యనీతిమార్గమునఁ♦గీల్కొనవట్టి గుణాభిరాముఁడు
ద్దాంతుఁడెఱుంగు మర్జునుఁడు♦దైవతసన్నిభబాడబాగ్రణీ॥

మేమీ నరేంద్రుని సఖులము. మమ్మందఱి నిఁక నిమ్మందాకినిఁ దీర్థములాడింపుఁడు.

శా...[తనలో] ఏమి నాభాగ్యము. పురోహితులు చుట్టకము న్నె వీరి నభిషేకింపఁ జేసెద,

[మాధవదీక్షితుఁడు ప్రవేశించి]

మా...[ఆక్రోశముతో] వీఁడెవ్వఁడో వైదేశికవిప్రుఁడొకఁడు వీరల స్నానమాడింప నెంచుచున్నాఁడు. వీఁడీ యూరి సాంప్రదాయము నెఱుంగఁడు కాబోలు.

మ॥ మదమో సాహసమో యెఱుంగవొయిటన్♦మర్యాద లోభంబొ నె
మ్మదికిం బైత్యమొ యాత్రికోత్తములని♦మ్మందాకినిం గ్రుంకఁజే
సెదు మమ్ముం గణియింపకేఖల! నినుఁ♦శిక్షింపగాఁజేతు నెం
దదయుల్ దోషులపట్లఁగాసియుచు బాం♦డ్యాల్ ధైర్యపాకోనిధుల్॥

ఓరీ! కాశీవాసులమగు మమ్మ నిరాకరించియే యాత్రికుల స్నానమాడింప నెంచితివా! దరిద్రుఁడా!

శా...(భయముతో) నే ననుకొన్నంతయే యైనది. తీర్థవాసుల నతిక్రమించి నే నిందుఁ బ్రవేశించుట నాదితప్పు. ఇఁక నీతనితో నెదిరిమా

టాడితినేని నొక్క పిడికిలి దెబ్బతో నిపుడే నన్ను స్వర్గమునకుఁ బంపఁగలఁడు. కావున నెట్లైని నీతని బతిమాలి యిటనుండి తప్పించుకొని పోవుట కర్జము. (ప్ర) అయ్యా! వీరలు నన్ను నిర్బంధించుటచే నే నిద్దానిఁ బూనితిని. నాకై నేను తలంపను. సైరింపుఁడు,

మా...వారు నిర్బంధింతురుగాక నీవేల యిట్లు లోభంబున కొడిఁగట్టితివి?

శా...[తనలో]లోభంబునకే యొడిఁగట్టితిని. [ప్ర] అయ్యా! తెలియక పూనితిని.

మా...పసిపాపవా? ఏల తెలియదు. నాలుగుపుష్కరములవయసున్న దే!

శా...అయ్యా! క్షమాపణము గోరిన పిమ్మటఁగూడ నన్ను ధర్షింపుట తగవుగాదు.

మా...తగవులేదు నగవులేదు, నీకుప్రాయశ్చిత్తము కావలెను. పొగరణఁగవలెను,

అ...పురోహితాగ్రేసరా! యీపేద బాఁపనితో నీకేల వివాదము. మేమే యీబాఁపనిఁ బిలిచితిమి, ఇపుడు నియమప్రకారము మీరే మమ్ముఁ దీర్థమాడింపుఁడు. మిమ్ముఁ బూజించిన పిమ్మట వారిని సత్కరించెదము.

మై...దీని సిగ దరగ నాకు మంత్రము జ్ఞాపకము లేకపోయినది. లేకున్న నాస్థానబ్రాహ్మణుఁడను. నేనుండఁగ మీకీదెబ్బలాటే లేకుండెడిది

మా—రాజాగ్రణీ! కాశీవాసులమగు మేము దక్క నీ గంగాతీర్థంబు యాత్రికుల కభిషేకింపఁజేయ నింకొకరి కధికారము లేదు. ఎవఁడేని నీ విప్రునిభంగి నీ నియమంబతిక్రమించినచో వాఁడు మాచే బాధ్యుఁడగును. ఇందు స్నానాదిక ధనము మాయది గుడిలో నొసగెడు ద్రవ్యము దేవునిది. ఆవల మీరిఁక లక్షలు పంచిపెట్టుకొన్నను మానుకున్నను మాకు సంతోషమే. (శారదాముఖునితో) ఓయి! దరిద్రుఁడా! నేఁటికిఁ బ్రతికి పోయితివి. ఇఁక నెన్నఁడిట్టి యనుచితం బొనరింపకు. [విశారదార్జునులతో) రాజసూనులారా మీరిఁక స్నానము సేయుఁడు పదఁడు,

అ—(శారదాముఖునితో) స్వామీ! తాము నుబోవకుఁడు. మిమ్మును బూజించెద మిటనుండుఁడు.

(అర్జున విశారద మైత్రేయులు నిష్క్రమింతురు)

మా— కం॥ ఇమ్మందాకిని విమలజ
లమ్ముల నీరాడి యుదక ♦ లవముం గొననా
కమ్మున నెక్కొను ♦ వెక్కయు
గమ్ములు మనుజుండు రత్న ♦ గర్భాజానీ!

"సమస్తదోషనివారణార్థం గంగాస్నానం కరిష్యే" యనుఁడు. ముక్కు చెవులను గన్నులను మూసికొని మూడు మునకలు వేయుఁడు.

(కృతస్నానులై అర్జున, విశారద, మైత్రేయులు ప్రవేశింపుదురు)

మా—మహారాజకుమారా! అసమానంబగు నీ గంగాజలావగాహనం బీవు గాంచితివి. ఇఁక నీ యసాధారణ వితరణంబేను గాంచవలెను.

మై...ఇవన్నియు డబ్బులాగేయెత్తులు.

అ...భూమిసురాగ్రిణీ! తామెద్దియేని గోరుఁడు. దాని నొసంగుదును.

మా...పదివేల నిష్కంబు లిమ్ము.

మై....మోఁతకూలి కెవరేనిఁ గావలయునా! పిచ్చిమాటలు తలపెట్టకు మాయొద్ద నెక్కువ దొరకదు. మీకిద్దరికిఁ జెరియొక యేగాని నిప్పిం చెదను ఇష్టమైనఁ బుచ్చుకొనుటయు లేకున్న మానుకొనుటయు.

మా...పానకములోఁబుడకవా!

మై...అవునట్లే! లేకున్నఁగొంపఁద్రవ్వి తెచ్చి తలకెత్తుమనెదవు.

[అర్జునుఁడొక ముద్రితపత్రంబు నీయ దీక్షితుఁడు చేకొని)

మా...చాలు సంతోషము కాశీయాత్రా సంపూర్ణఫలావాప్తిరస్తు.

మై...నక్కను దొక్కివచ్చితివిపో మొదలఁదెలిసిన భాగమేనిఁ గుదిరించుకొని యుందును.

మా...రాజన్యకుమారా! ఇఁక నేఁ బోఁయివచ్చెదను, ఈవిప్రుఁగూడ సత్కరింపుఁడు.

మై...ఉరకవచ్చిన నేనును నాకొడుకని గదా?
అ॥ వి...నమస్కారము.
మా...కల్యాణము.
మై...భట్టారకా! నమోనమః
మా...నమోనమః (మైత్రేయునిఁ గౌఁగిలించుకొనును.)
మై...నే బక్కవాఁడను పున్నెముఁ గట్టుకొనకు జాగ్రత్త.
మా...[నిష్క్రమించును.]
అ...(శారదాముఖునితో) భూసురచూడామణీ! ఇఁక మీయిష్టంబుఁ జెప్పుఁడు.
శా...రాజన్యకుమారా! నే బీదబ్రాహ్మణుఁడను వేదాధ్యేతను బహు కుటుంబకుఁడను. నీ దయకుఁ బాత్రుఁడను.
అ...స్వామీ! నాభాగ్యవశంబునఁ దాము చేకూఱితిరి. ఇపుడు తమ యభీష్టం బేదియేనిఁ గోరుఁడు అరమర లేక యిచ్చెదను.
మై...(శారదాముఖునితో) (జనాంతికముగా.) చెరిసగాయస్వాహా
శా—(తనలో) భూదానమడిగెదను. దానివెనుక నే సకలము, స్థిరమైనది పారంపర్యముగా జరుగునది. (ప్రకాశముగా) రాజకులాలంకారా! నా పేదఱికముఁ బాపనెంచితివేని. యొక యగ్రహారంబునిమ్ము.

(అర్జునుండొక ముద్రిత పత్రింబీయఁ గైకొని.)

శా...(తనలో) నెఱదాతయగు, నీనరనేతచే నాలేమిడిలీఱె కాశీపురంబు కాంక్షితప్రదంబని యెఱుంగకదూఱితిని. (ప్ర)సార్వభౌమకుమారా! నాకిఁక సెలవిమ్ము.
అ॥ వి...వందనము.
శా॥ విజయోస్తు.
మై—ఏమిబాఁపఁడా! నీతస్సఁగోయ నేనప్పుడు చెప్పలేదా? సగమిచ్చి కదలు [అని యడ్డపడును.]
శా...పాండ్యా కటాక్షించి విడిచిపోయినాఁడుగాని యీ గ్రహము నన్ను వదలునట్టు లేదే (ప్రి) అయ్యా; నీకేమి మహారాజసఖుఁడవు నీకీ బీదవానికిచ్చిన దానిలో భాగము కావలయునా.

మై...నీవెట్టి ముట్టిస్తుతులను నే కోరెడువాఁడను గాను. ఇచ్చి కదలు.

శా (భయముతో నర్జునుని మొగముఁ జూచును.)

అ...వృషమిదేవరా! మైత్రేయుని వాక్కుల లెక్కింపకుఁడు పొండు.

(నిష్క్రమించును)

అ—మిత్రులారా! ఇఁక నీభాగీరథియందొక్కింత విహరింతము రండు.

మై—నీవు నాయెముకలు గొరికినను నేనురాను. మన చాకచక్యాలీ గంగముందఱ సాగవు. నీటిపాములు మొసళ్లుంగి లోపలికి లాగికొని పోవఁగలవు. మీరునునామాటవిని యీఁతకు బోవకుఁడు.

అ—దొడ్డసలహా చెప్పితివి, నీవుపాఱుఁడవుకావా.

(అ, వి, లు నిష్క్రమింతురు)

[ఉలూపి సఖితో సమీపించి సంతోషముతో)

ఆహా ఏమినాభాగ్యము.

శా॥ కంటిన్ గన్నుల కింపుగల్గఁ బ్రియు రా ♦ కాపూర్ణచంద్రోపమున్
వింటిన్ వీనుల విందెసంగఁగను బృ ♦ థ్వీనాథు పల్కుల్ గనుం
గొంటిన్ నోములపంట నింకఁ బ్రియుఁడ ♦ క్కుంజేర్చి నన్నేలినన్
దంటన్ గానొకొ నాగకన్యకలలో ♦ దైవంబు తోడుండినన్॥

సఖీ! నిపుణికా! నా భాగధేయమూర్తియగు నీ రాజసూతిన్ గాంచితివి కదా అలనాఁడు నారదమునిచేఁ దెలుపఁబడి లోకాంతరంబున నుండియే నామనోధనం బపహరించిన మోసగాఁ డీతఁడే.

ఉ॥ ఈతఁడె రాజులందఱు "బ ♦ ళీ" యని మెచ్చఁగ మీనయంత్రమ
త్యాతతశక్తిఁ ద్రుంచి ద్రుప ♦ దాత్మజఁ గృష్ణవరించినట్టి ఱేఁ
'డీతఁడె శౌర్యధైర్యముల ♦ కిల్ల'ని పెల్లుగ నెల్లరెన్నఁగా
ఖ్యాతివహించినట్టి నరుఁ ♦ డార్యుఁడు నాదయితుండు నెచ్చెలీ॥

శా॥ బాల్యంబందుననుండి యీతనియెడన్ ♦ బద్ధానురాగాత్మనై
కల్యాణంబునుఁ గాంచకే దినములన్ ♦ గాఁ బుచ్చితిన్ జిత్తనై

ర్మల్యంబొప్పఁగ నేటిదాక ని ♦ పుడీ మాన్యుండుగన్పట్టెసా
శీల్యంబేర్పడవీనిఁగూర్చినను ర ♦ క్షింపఁగదే నీవిఁకన్॥

లేదేని నీ సఖి జీవింపదు.

ని—ఇంతీ! యింతచింతయేల! ఈ కనెడువారి కనులఁగప్పి నిముసములో నీ రాపట్టిఁబట్టి నీ కేళీసౌధంబుఁ జేర్చెద పదంపడి నీయిష్టం బీడేఱును

ఉ—సఖి! ప్రియమల్లెనిఁ బోదము రమ్మి. (నిష్క్రమింతురు)

మై—(పరికించి)చెలికాఁడా! ఏమది యేమది.(ఉరమునుమోదుకొనుము)

వి—(త్వరతోఁబ్రవేశించి) మైత్రేయా! యేమట్లు భయఁపడేదవు. తేఁడు వినోదంబుగ మునిగియుండు. ఈఁత రానివాఁడా ?

మై—ఈఁత యేట్లో గలిసినది. కొంప మునిగినది. చెలికాని నే నీటి దయ్యమోకొనిపోయినది. నీవు కానవు. బాబో చెలికాడా!

(మరలఁ బొట్టను బాదుకొనును.)

వి—అమంగళము శాంతమగుఁగాక. ఏమియిది నిక్కమా ? మాటాడక యాకస్మికముగ మునిగెనే! లేక మాకనులకు పైత్యభ్రమ కమ్మెనదా ? (కనులఁదుడుచుకొని యొకమాఱు మూసికొని తెఱచి బిగ్గఱగా) మిత్రమా! మిత్రమా! (కలయఁ జూచి) ఇంకను గన్పట్టఁడే! మైత్రేయుని మాటయే నిజమైనది. హా పాండురాజనందనా! యర్జునా! (మూర్ఛపోవును)

మై—ఇపుడు నేనేమి సేయుదును నాచెలికాని నొప్పగింపుమని యిటఁ జాలుగ రుద్రాక్షపూసలఁ ద్రిప్పుచుఁ గూర్చుండిన నీ బాఁపలఁ బట్టుకొని వేధింతునా!

వి—(మూర్ఛఁ దెలిసి) హా మిత్రరత్నమా! హా వయస్యా! హా భారతకులాభరణ!

ఉ॥ హా సకలావనీరమణ ♦ హా యభియాతివితానభీషణా!
హాసముదారపావన గు♦ణాభరణా! శరణార్థిరక్షణా!
హాసుయశోవదాతహరి♦దంతదలా! హతపాపమండలా!
హాసుమనోమనోంబురుహ ♦ హార్షకరా! నరపాలశేఖరా॥

అక్కటా! ఇఁక నెక్కడికేగిననా చెలికానిఁ గన్నులపండువుగఁ జూడఁ గందు, ఎవ్వరినడిగిన నాచెల్మికాని సేమం బుపదేశింతురు. హా కుంతీగర్భశుక్తిముక్తారత్నమా మిత్రమా! నీకిది మేరయగునా? నీ యనుంగునై నిన్నే ప్రాణధనమ్ముగ నమ్మియే ప్రొద్దు నీతోఁడనీఁడవలెఁ గాలంబుఁ గడపెడు నన్నీ పెన్నేటియం దెడఁబాసి గాసిఁ జెందించిన నేఁబ్రదుకఁగలనా. ఏపాడు జలజంతువుల కాహారంబైతివో, నీ యటులకాదు నిరర్గళభుజార్గళుఁడవగు నిన్నే జంతువు లేమిసేయఁగలవు? సర్వసంహారుఁడగు పరమేశ్వరుండిట్లస్తమింపఁ జేయనోపు. కటకటా! ప్రాణపంచకం బే సోదరపంచకంబని తలఁచు నీ యన్నదమ్ముల కిఁక జీవించు తెఱంగేది. బాల్యమునుండియు నీ యందనురాగము నొంది నిన్ను జేపట్టం దలఁచి యున్న సుభద్ర కిఁకఁ దెరువేది. ప్రళయపారావార తుంగతరంగానుకారి యైనను, నీ మిత్రవియోగదుఃఖం బీ విశారదగాత్రింబునంతరింపఁ జేయదేమి. గంగాతటినీ! నీకుఁ గడుఁగూర్చు బంధువుఁడును నాకు మిత్రుఁడును నగు విజయుని నీలో నణచుకొనుట నీకు న్యాయమా! లేక ప్రపౌత్రుని రత్నంబుల సత్కరింప నీభర్తయగు రత్నాకరుకుఁ జేర్చితివా! హా శరణాగతకల్పమహీరుహుఁడవగు విశ్వేశ్వరా! నీవు దయామయ హృదయుండవు! సజ్జన బాధాటవీకుఠారుండవు! నీవేల యిట్లు కరుణ వీడి నాసఖుఁ గాన్పింపవు. విశ్వాత్ముఁడవగు నీవాతని మంచి చెడ్డల నెఱుంగవా! మున్ననేకుల నిన్ను భజించిన యాపన్నులను గరుణించి రక్షింపవా! నేఁడట్లు నాసఖుని నా కర్పింపుము! ఓగిరులారా! తరులారా! జాహ్నవీతరంగ నికరములారా! మీరైన నాసఖుఁ గనపఱచి పున్నెంబుఁ గొనుఁడు.

ఉ॥ సౌరభసారపూర పరి ♦ సాంద్రసరోజమరందయోగ వి
స్తారితగంధవాహశిశు ♦ సంఘములారా! చలాచలోర్మికా
వారచలన్మహోత్పల ని ♦ వారిత భృంగములార! సుందరీ
మారుబిసప్రసూనసుమ ♦ మారు మహీంద్రకుమారుఁ గానరే॥

హా భరింపఁజాల మిత్రవియోగదుఃఖాకులితమ్ములగు నీప్రాణ

మ్ముల నిలిపి జీవించుటకన్న నీచంద్రహాసముఖమ్మున నాసఖుననుగమించుటయే మేలని తోఁచుచున్నంతనే యాత్మహత్యాదోషస్మృతి యాభాగ్యంబు నవులకు గెంటుచున్నది ఇంక నుపాయంబేది.

తే॥గీ॥ బ్రతికియుండుమనా యికఁ ♦ బ్రాణసఖునిఁ
బాసిసిగ్గఱి జీవచ్ఛ ♦ వంబనగుచు
చత్తునా యాత్మహత్యాదో ♦ షమునుగొనుచు
కటకటా విధి! యివ్విధిఁ ♦ గలఁపఁదగునె॥

(తెరలో)

విశారదా! ఏలయిట్లు పలవించెదవు? నీమిత్రుఁడు కొండొకకారణంబునఁ బాతాళమునకేగె తిరుగఁ గతిపయదినంబులలో నిటకు రాఁగలఁడు మానుమీశోకవేగము.

వి...ప్రియము ప్రియము నాసఖుఁడు పాతాళంబునకేగినాఁడా? ఆమాటనిక్కమే. మరల కొలదిదినములకిటకు రాఁగలఁడా? అదియే యంతనమ్మఁదగినదిగాఁ గన్పట్టదు. అయిన నీప్రియము చెప్పినవారలెవ్వరో వారినెఱింగి పదంపడి విచారించెద.

(ఆకాశముఁజూచి) అయ్యా! నాయందనుక్రోశముతో నాసఖుని సేమంబు నెఱింగించిన తామెవ్వరో తెలిపి నాసఖుఁడు పాతాళమునకేల పోయెనో కరుణించి సెలవిచ్చెదరా?

(తెరలో)

నేనాకాశవాణిని నీసఖునివృత్తంబంతయుఁ ద్వరలోనతఁడువచ్చియే నీకుఁ దెలుపఁగలఁడు.

వి...ఈవకాణించినది భగవతి గగనవాణియా! ఈమెవాక్కులు నిక్కవములు. ఇఁక మేమీదుఃఖముఁదొలఁగి యీయమ సెలవుప్రకారము నాసఖుఁడిటకేతెంచెడువఱకీ గంగాతీరంబుననే వసించెదము మైత్రేయా! యిటురమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.



# సుభద్రా కల్యాణము

## తృతీయాంకము.

—×—

[ తెరలో ]

చ॥ పడఁడీఁకఁ బోదమల్లదియె ♦ పౌర్వదిశన్ దెలవాఱుచుండె నీ
యడనునఁ బోవకుండినఁ బ్ర ♦ యాణము తూఁగదు హాయి కాదు తెం
డిదిసమయంబు వేగనిటు ♦ లేనిదురించుచునుందురే! కనుం
డదె చనుచున్నవాఁడు సఖు ♦ లారసి మార్గముఁ జూప ఱేఁడునన్॥

( ఇదిచూళిక )

[యథోక్తముగా నర్జునుఁడు మిత్రులతోఁ బ్రవేశించును]

వి...చ॥ ముగిసెను బుణ్యతీర్థము ల ♦ మోఘతరవ్రత! వత్సరంబునన్
ముగిసెఁ బ్రతిజ్ఞదీక్ష నిఁక ♦ ముందఱఁగన్పడుఁ జూడు! ద్వారకా
నగరము దానిఁజేరి యట ♦ నందకుమారు భజించి కూర్మిమీ
ఱఁగ వరియింపుమా! సుగుణ ♦ రాసిని సమ్మురవైరిసోదరిన్॥

( కేలఁజూపుచు )

ఉ॥ అల్లదె! ద్వారకానగర ♦ మయ్యదువీరులకెల్ల యున్కిప
ట్లల్లదె! కోట! దుర్గమమ ♦ హాయదె! గోపుర! మల్లవె! కడున్

జల్లనిపిల్లగాడ్పులను ♦ జాలఁగనోలిఁగఁ బంపుపుష్పితో
ద్యల్లవలీవనోత్కరము ♦ లల్లవె! యాపులమందలోసఖా!

అ...[సంతోషముతోఁగాంచి] తనలో

ఉ॥ బంగరుమై మెఱుంగుతెల ♦ ప్రాయపుసోయగముల్ పిసాళివా
సింగనుమేల్ హొయల్ దనరు ♦ చిత్తజురాణియనఁ జెలంగు చి
త్రాంగదకేలుఁబట్టితిఁ గ్రొ ♦ త్తార్థుఁడనై తినటంచునెంచ మీ
ఱెంగద కృష్ణసోదరి వ ♦ రీత మహాద్భుతమోహవైకృతుల్॥

[ప్రకాశముగా] మిత్రమా! మంచిదారిఁజూపితివి. ఇఁక నేనిందుఁజేరి యెటులైన నక్కాంతాలలామం బరిగ్రహించి పుట్టుకకుఁదగిన మురువుఁగూర్చుట యుక్తము. అయిన నాకాత్రిలోకసుందరి యెట్లుచేకూరఁగలదు ?

మై— కం॥ బూటకములాడ నేటికి
పాటిగనిఁగాంచి నంత ♦ బాళిఁగొనిరా
బోటివలరాజుతూపులఁ
గాటులనొందు న్నిజంబు ♦ గాఁ జెలికాఁడా!

అ...(చిఱునవ్వుతో) మైత్రేయా! పరియాచకమాడెదవా.

మై...పరియాచకమేమున్నది. నేనును నీవలె నాట్యాచార్యుని కూఁతును వర్ణింపుచుండుటలేదా భగీరథయత్నమున నిఁకబెండ్లాడనా? ఆకన్నెకు నేను మన్మథునిలాగునఁ గనబడుదునఁటనియును నాపై నాపె కన్నేసినదనియును నిరుగు పొరుగు వాఱందరందురు.

వి...[ఏకసక్కెముగా] నీవువలచినయామె యంతరూపవతియేమి?

మై...రూపవతియేమి నాకనులకుఁ బ్రత్యక్షరంభ.

అ...మైత్రేయా! మీరిరువురనురూపులై యుందురు. ఆ దేవకీతనయకును నాకును జాల యంతరముగలదు.

తే॥ గీ॥ పరువమగుదొండపండఁట ♦ భామమోవి
విద్రుమఫలంబులంట య ♦ వ్వేలఁదిపదము

లల్లనే రేఁడుపంౘఁట ♦ యతివకురులు
లలనలోకైకభాగ్యధ ♦ నంబుసఖుఁడ.

మై...అట్లేని మఱి మద్దతీనిఁ గురూపులనుగా నెంచితివా ?

అ...(నవ్వి) హరి హరీ ! అట్లుకాదు ఇర్వురు సుందరు లంటిని.

మై...అయిన మా యాపెను గుఱించి వినుము.

తే॥ గీ॥ పసపురంగులుగల పెస ♦ ర్పప్పుచాయ
లమరు దేహంబు గలదఁట ♦ యందమైన
రాజనాలన్నపుం డాలు ♦ నోజఁదాల్చు
నగవుగలదంట యన్నాతిఁ ♦ బొగడఁ దరమె॥

వి...[నవ్వి] అట్లయినఁ గోఁతికిఁ గొబ్బరికాయ దొరకుకట యే.

మై...హనుమంతునిఁ గొల్చుట లేదో.

వి...(అర్జుననిఁ జూచి)

చ॥ కలఁత పడంగ నేటికి స ♦ ఖా! వినుమా! యమురాజకన్య స
త్కలలకునాకరంబు హొయ ♦ కారిమెఱుంగు లెఱుంగు జాణ నీ
వలఘువిలాసవిక్రమ క ♦ళాంచితమూర్తి—వియాట నీవయిన్
వలపుల నించెనంచు నుడు ♦ వన్ వినవో మునుము న్నె యెల్లరున్॥

వెండియు నీఁక సర్వజ్ఞుండును దమకుఁ గడుఁగూర్చు బంధుమిత్రుఁడు
నగు శ్రీకృష్ణుండామెను|దమకుఁగాక వేఱొక్కని కొసఁగఁడు నిక్కము

అ...మిత్రమా! లోకులవాకుల కేమిగాని నీవనినట్లు యాదవపట్టభద్రుఁ
డు నాకీ సాయముఁ జేయనోఁపు. అయినను సఖా! కురురాజమిత్రుఁ
డగు బలరాముఁడు ప్రతికూలించుననిసందియమయ్యెడు.

మై...చెలికాఁడా! ఇందునకు నేనొక్క సలహా సెప్పెదవినుము. (చెవి
లోఁ జెప్పి) ఇట్లు చేయుము నీకు శుభం బగును.

అ...సఖా! యిట్లుచనిన శ్రీకృష్ణుండెట్లు గుఱితించును.

మై...చ॥ ఒకకడనుండునంచు మఱి♦యొండొక తావున నుండఁడంచు నెం
చకుము సమస్తవిష్టపర♦సాతతుఁలందున నిండియే యుపా

సకనిక రేప్సితార్థములఁ ♦ జక్కఁగఁ గూర్చుచునుండుఁ గేశవుం
డకుటిలమైనభక్తి దహ ♦ రాంతరమందునఁ గొల్వుమాతని॥

దీనసీకుఁగల్యాణముచేకూరు

అ...మిత్రమా! మేలుగఁ జెప్పితివి. ఇపుడే యద్దేవుని భజించెద.
(భక్తితో నంజలి ఘటించి)

పృథ్వీ॥ నిరంతరమహాంభజే మనసికృష్ణకల్పద్రుమం
రమారుచిరవల్లరీ లలితబాహుశాఖోజ్జ్వలం
ఉదాత్తఫలతుష్టశిష్టశుకభారతీ విభ్రమం
సమస్త జగదుత్సవాస్పదగరిష్ఠమూలాశ్రియం

చెలికాఁడా! ఇఁక నీ యుపదేశంబు సల్పెదను. నీ విఁక విశారదుని తో నింద్ర ప్రస్థంబుఁ జేరి సోదరులకు నాసేమంబుఁ దెల్పుము.

మై—యాత్రలో లంకణములు మాపాలు. ద్వారకలో లడ్డుకములు నీ పాలు ఇంతతో మాకు సెలవిచ్చితివి. ధన్యులము. కాని నీవిపుడే నా యుపదేశంబు సల్పవలయును.

అ—అట్లే చేసెదను. కనుము.

[ నిష్క్రమించి యతియై ప్రవేశించును ]

మై॥ వి—(తలయూచి సంతసముతో నిష్క్రమింతురు)

యతి—[పరిక్రమించి పాఱఁజూచి] అదియే ద్వారకానగరభూషణంబగు యాదవుల రాచనగరు.

(వినుట నటించి)

అపుడే రామకృష్ణులాస్థానిఁ జేరినట్లు మాగధులుద్ఘోషింపుచున్నారే! నేనును బిరానవారలఁ జేరెదను. (పరిక్రమించును)

(రామకృష్ణులు సింహాసనములందుఁ గూర్చుండి ప్రవేశించి యుందురు)

బ—[ఆహా! నేఁ డెంత సుదినము]

శా॥ కౌరవ్యాన్వయసింధురత్నము లస ♦ ద్గాంభీర్యవారాశి పృ
థ్వీరాజన్యకులైకశేఖరము నా ♦ పేరైన శిష్యుండు గాం

ధారేయపరిథముండు మదర్చిత సం ♦ ధానంబు నెంతో ప్రియం
బారంగాఁగొనియిష్టముల్ దెలిపె భ ♦ వ్యంబబ్బె నేఁడాత్మకున్॥

ఇంకను

చ॥ కనకపుమేడలందుఁ జెలి ♦ కత్తెలు వేవురు గొల్వ విల్వమీ
ఱినయపరంజివల్వల మ ♦ ఱిన్ దులలేని విభూషణంబులన్
దనియుచుఁ బూవుసెజ్జల స ♦ తమ్ము వసింపుచుఁ దోడిరాణులం
దున దొరసానియై ముదము ♦ తోఁ దనరారెడు ముద్దుచెల్లెలా॥

వేయియేల.

చ॥ కుదిరెఁ బ్రశస్తమౌ మనువు ♦ కోమలికబ్బె విశేషభాగ్యమీ
యదనుననే వివాహము ర ♦ యంబుగఁ జేయఁ బ్రియంబుగూరునా
హృదయము నిల్కడం గనునెఁ ♦ కీ హరినిన్ దలిదండ్రులన్ వశం
వదులనొనర్చు వాఁడఁ గురు ♦ వల్లభు నల్లునిగాఁగఁ జేకొనన్॥

(ప్రకాశముగా) తమ్ముఁడా! చక్కదనముల కిక్కయగు మన సుభద్రకుఁ దగినవరుండు కురుకుల భూషణుండగు సుయోధనుండని నే నిశ్చయించితిని. ఆతనికన్న మిన్న లేకున్నను సాటికేని దీటగురామేటి యొకఁడు గాన్పింపఁడు గదా.

చ॥ కురుకులమందుఁబుట్టుక య ♦ కుంఠితపూరయ శౌర్యమాహవో
ద్ధురులగు కర్ణశాంతనవ ♦ ద్రోణులు దోడ్పడు వారలెల్ల భూ
వరులెపుడెప్డు రుక్మరథ ♦ వారణ రత్నములిచ్చి భక్తిఁగొ
ల్తురు కురురాజుతోడ సరి ♦ దూగునె వేఱొకరాఁచ వాఁడిలన్॥

ఆతఁడును మన సుభద్రయందు వలపు కలిగియున్నాఁడనియును మన మిచ్చెదమన్నఁగన్నెఁ బ్రియంబుగఁ బరిగ్రహించువాఁడనియును బ్రణిధులచే వింటి, ఇందులకు నీ యిష్టంబేమి.

కృ—(తనలో విషాదముతో) అక్కటా ఈతఁడు తన చెడ్డతలంపును నే
డు నాకుఁగూడఁ బ్రకటపఱచినాఁడు గదా. ఏవిధంబున దీనిఁ

బోకడఁచెద. (కొంచమాలోచించి) ఇపుడిట్లు సెప్పెద. (ప్రి) (సాభ్యసూయముగా) అన్నా! నీ వెన్నిన దుర్యోధనుని వన్నెలన్నియు నేవిన్నవే క్రొత్తవికావు. నీవు నుడువని కల్యాణగుణంబులింకను గొన్నికలవు వినుము.

తే॥ గీ॥ తనకు విలుఁబట్ట నేరాదు ♦ తండ్రిగుడ్డి
తేరుగడపరి కొడుకుతోఁ ♦ దెగనిచెల్మి
దుడుకు సేతలలో మేటి ♦ పిడుగుపేరు
చెల్లు దుర్యోధనుఁడు మన ♦ చెల్లియలకు॥

వెండియు వినుమింక నతఁడెట్టివాఁడైన మనకేల యాతనిగోల. మన బంధువులగు పాండవులకుఁ బగతుఁడు కావున మనకుఁ బగతుఁడేకాని బంధువు కానేరఁడు. ఇఁకనర చేతనున్న వెన్నముద్దన్ గానక తిరుగు వానివలె మన చెల్లెలికిం దగిన వరుఁడెవఁడందు వేని వినుము.

చ॥ పసితనమందనిన్, ద్రుపదుఁ ♦ బట్టె నెవండు గురుప్రతిజ్ఞకై
కసిమసఁగెన్ మహాస్త్రమునఁ ♦ గాన నెవండరరేయి ఖేచరున్
వెసరఘుమయంత్రమున్ విఱుఁగ ♦ వేసినృపాత్మజఁగాంచె నెవ్వఁడా
లసదసమానవిక్రమవిలాసభ ♦ రాలసుఁ డర్జునుండగున్॥

మఱియును,

ఉ॥ కాంతులకాకరంబతఁడు ♦ కాపురుషాళికిమిత్తి పావన
స్వాంతులఁదన్పుదాత నయ ♦ వార్ధి దురంతవిపత్కదంబక
శ్రాంతుల యూఁతకోల రణ ♦ చాతురిలో రఘురాముఁడారయన్
గుంతి తృతీయనందనుఁడే ♦ కోమలికిన్ దగుజోడు చూడుమా!

ఉత్సా॥ వినుము! దేవ! మన సుభద్ర ♦ విజయుఁగూడి రాజిలున్
మన సుభద్రఁగూడి విజయ ♦ మనుజభర్త భాసిలున్
కనఁగ వీరి యోగమలరు ♦ కనకరత్నయోగమై
కనకయుక్తరీతి నన్య ♦ గతిఁ దలంపఁ జెల్లునే

చెల్లెలి వలపులు క్రీడియందునను క్రీడివేడుకలు చెల్లెలియందును వఱ

లుచుండుట విన వైతివా! విజయకాంక్షిణియగు మన చెల్లెలిన్ దుర్యోధనునకుఁగట్టుట కాకిముక్కున దొండపండుఁ గట్టుటకాదా! ఇఁక మన మందులకు సాహసించినను జగద్విజయుఁడగు సవ్యసాచి యుఁగుపేక్షించి మిన్నకున్నఁగాక చలమూనిన శక్తులమా?

బ—(తలపంకించి) చలమూని యేమి సేయును.

కృ—మనలను జయించి తన మేనమఱఁదలిఁ గొనిపోవఁగలఁడు.

బ—(రోషక్రోధములతో) అహంకారమిట్లు ప్రేరేపించుచున్నది. [కృష్ణుని నిరూపించి) ఓయిపాండవపక్షపాతీ! వృథావచనహేతీ! కలలో నైననట్లు దలఁపకుము. పాండవులు చుట్టాలైనయెడల రారాజు నాకు నెయ్యుఁడు ఎందునేనిఁ జుట్టలకన్న నెయ్యురే మొదలఁ బేర్కొనఁదగినవారు. మఱియు నీ వెనువెంబడిఁదిరుగుచు నీ కూడిగంబుఁజేయు కవ్వడిగుణంబుల నింత పొగడవలయునా! నేనెఱుంగనిది యేమున్నది.

తే॥ గీ॥ పట్టణంబుల బిచ్చముఁ ♦ బట్టి పొట్ట
నింపికొనినట్టివారు వ ♦ నీతలముల
కందమూలాశనముల నా ♦ నందపడిన
వారునుం గారొ యీ పాండ ♦ వప్రముఖులు॥

నాఁడీ కవ్వడికి మగతనము లేకుండెనా! ఉండియే కారడవులలోని కందమూలంబుల రుచులెఱుఁగఁగోరి యట్లుండెనా! తల్లిపుట్టింటికత మేనమామ కుపన్యసించినట్లు నాకా? నీవీ నీతులు చెప్పుట. ఇఁకఁ జదువులజాణయైనను జేటుపాటెఱుంగని ముద్దియ సుభద్ర తలఁపు పాటిసేయఁ గూడునా! వెండియు నీవన్నయట్లా కిరీటి సమరంబునకే పాలఁబడునేని యపుడే మదీయాభీలహాల కౌశలంబు విశదంబు గాఁగలదు.

ఉ॥ ఎన్నఁడుకాని సంతమస ♦ మేగి దివాకరు ముంచివేసినన్
బన్నగనెన్నఁడేనియును ♦ బర్వతముల్ ఛిదురంబు నొంచినన్
జిన్నతనంబుఁగేసరికిఁ జేసిన ♦ నే నిఁక యెన్నఁడేనియున్
నన్ను జయించు చందము క ♦ నంబడుఁ గ్రీడికి నాఁడు పోడిగన్॥

కృ—(చిఱునవ్వుతో) అన్నా! ఆ పాండవుల యుల్లము తెఱఁగు నీ కె ఱింగించితిని కాని నా తలంపది కాదు.

బ—నీ తలఁపు నాకుఁ దెలియునులే.

ఉ॥ అక్కసుదీఱఁగా తనదు ♦ నన్నలఁదమ్ముల నక్కిరీటి దా
నెక్కొని ద్వారకాపురిని ♦ నెట్టనముట్టడి సేయఁగల్గినన్
జక్కఁగ నీవు చెల్లెస ధ ♦ నంజయు పాలొనరింపఁ బూనినన్
నిక్కము నిల్వరించి కురు ♦ నేత కొసంగెద ముద్దుచెల్లెలిన్॥

కృ—అన్నా! ఇంకను నా మనసు గుఱుతింపవా! అన్నదమ్ములమగు మన కొండొరులకు భేదము కలుగునా! నీ సంకల్పమే నామనో హితము.

గ—అట్లయిన మంచిదే!

యతి—(సమీపించి)
కంచుకీ!

క...(ప్రవేశించి) దివ్యసుందర విగ్రహుండగు తపసి యొకఁడిటకు వ చ్చుచు నన్ను బిలుచుచున్నాఁడు వలికెద. (సమీపించి) అయ్యా! యేమి సెలవు.

య—యతి యొకఁడు విచ్చేసెనని మీదొరలకుఁ జెప్పుము.

క—చిత్తము. (రామకృష్ణుల సమీపించి) భర్తలకుజయము, తపసి యొ కఁడు ద్వారంబున నున్నాఁడు.

బ—ప్రవేశపెట్టుము పొమ్ము. (కృష్ణునితో) శ్రీకృష్ణా! మనమా పరి వ్రాజకు నెదుర్కొందము పద.

కం—(నిష్క్రమించును)

యతి...క్రౌంచపదవృత్తము.

నీరజనేత్రా, వారిదగాత్రా, ♦ నిఖిలసుకవినుత ♦ నిపుణచరిత్రా,
మారనిదానా, సూరినిధానా, ♦ మహితదనుజగణ, ♦ మరణ విధానా
శ్రీరమణీశా, సింధునివేశా, ♦ శ్రితజననికరదు ♦ రిత తతినాశా
సారవివేకా, పాలితలోకా ♦ శమదమఘనముని ♦ జనహృదయౌకా॥

బ॥ కృ...(యతిని సమీపించి) యతీంద్రా! వందనము.

యతి...నారాయణ నారాయణ,

బ...(భక్తితో) మునికులతిలకా! ఈపీఠము నలంకరింపుఁడు.

యతి...(కూర్చుండి) మీరును గూర్చుండుఁడు.

బ॥ కృ...(కూర్చుండును)

బ...ఉ॥ ఎందుననుండి యీనగరి ♦ కిప్పుడు వచ్చితి? రిందునుండి ముం
దెందున కేఁగుదెంచమది ♦ నెంతురు! మీతిరునామమెద్ది? యె
క్కెందు వసించువారలుః? య ♦ తీశ్వర? మాకెఱిఁగింపుఁడయ్య మీ
చందము నందముం గనఁగ ♦ సంతసమొందుచునుండె మామదుల్

య...యాదవచంద్రమా! నేనరుండను ఋషిని. నాయాశ్రమము హిమాచల ప్రాంతము. శక్రప్రస్థము. భూప్రదక్షిణ నియమంబునఁ దీర్థముల ననేకంబులను సేవించి మార్గవశమ్మున మిమ్ముఁగాంచ నిటకు వచ్చితిని.

బ...(సంతోషముతో)

క॥ ధన్యుఁడనైతిని కులమది
మాన్యతఁగాంచెను యశంబు ♦ మఱియుతరసా
మాన్యంబై వెలసెను సా
జన్యనిధీ! మీరలిటకుఁ జను ♦ దెంచుటచే॥

య...యాదవమూర్ధన్యా! ఇట్లు పరస్పరమనుకొనఁదగినదే. మీరసమాన తేజోనిధులు. దేవతాత్ములు.

తే॥ గీ॥ కుమతులనుగూల్చి ధర్మంబుఁ ♦ గుతలమందు
దిట్ట మొనరింపఁ గాఁగాదే ♦ పుట్టినార
లీర లీయనఘుఁడు విష్ణు ♦ వీవా యాది
శేషమూర్తివి గాదె? ని ♦ శ్శేషితారి!

బ...[పట్టరానిసంతోషముతో] మునికులతిలకా! మీవాక్కులమృతల

హారులు. ఇఁకఁ దామునేవించిన తిరుభూములను గొన్ని సెలవిచ్చి యీవీనుల కుతుకంబుఁ దీర్చెదరా?

య...చ॥ మలయగిరిం గుమారగిరి ♦ మాల్యవదద్రిని గంధమాదనా
చలమును శ్రీగిరిం దుహిన ♦ శైలము వింధ్యనగంబు వెంకటా
చలమును గాశిమాయను వి♦శాలనయోధ్యను నింక మేదినిం
గలసుకృతస్థలంబులను♦గాంచితి నన్నిటిఁ దాళకేతనా!

బ...(తనలో) ఏమి నాయదృష్టము. కల్పభూజముగదలివచ్చి పెరటిఁ జేరినపగిది నప్రయత్నంబున నీయగణ్యపుణ్యుండు నేడు రె. ఇఁక వీరిం గన్నుల కర్వుఁదీఱనిటఁ గొంత కాలంబుంచి వీరివలనఁ దత్వసంకేతంబుల నారసినఁగదా. నాజన్మసాఫల్యము. (ప్రకాశముగ) తపోధనమంజూషా! ఒక మనవి.

య...నిస్సందేహముగా నడుగుము.

బ...మాయెడఁ గరుణించి యీరాఁబోవు చాతుర్మాస్యవ్రతంబు, నిటఁ గడిపి మమ్మింకను గృతార్థులను గావింపఁ గోరువాఁడ.

య...బలదేవా! తపసులు పరిత్యక్షణసంచారులని యెఱింగియు నీవిట్లు గోరుట తగవా?

బ...తపసిమానికమా! దాసులకోర్కెఁ దీర్పనుండెడుకాలముసయితము గణనీయమా? తొల్లివసిష్ఠాదులు నెలలకొలఁది రాజమందిరంబులఁ గాపురంబుండరా?

య...ఆ మునులు వేఱు మేము వేఱు.

బ...(నిర్వేదముతో) అయినచో మాయభీష్టంబంతరింపవలసినదియేనా?

క॥ "పెరుమాళ్ల సేవకన్నను
వరవైష్ణవమణులసేవ ♦ వాసిం గొను"నం
చెఱిఁగియుటు దేవురించితిఁ
బఱపుము మామీఁద నెనరు ♦ భవ్యవిచారా!

య...కామపాలా! ఇఁక నిరోధింపఁజాల నీయభీష్టము తీరఁగాక.

బ...ప్రియము. ప్రియము. (కృష్ణునితో) తమ్ముఁడా! ఇమ్మహానీయున కుఁ సేవఁజేయ నెవ్వరి నియోగింతము.

కృ...దాసజనమ్మునకుఁ గొదవా?

బ...నవుకరులు కొలువునకై కాక భక్తినిష్ఠులై స్వేచ్ఛాచిత్తానుసారంబుగ సేవల నొనర్పుదురా? మఱచితి. దేవబ్రాహ్మణగురుపూజాలోల యగు సుభద్రను నియమించి యామెగృహారామంబున సామికి ప్రవేశముఁ గావించెదను.

య...(తనలో) బలరాముని పన్నుగడను జూడఁగా నాభాగ్యరేఖ ఫలించెడునట్లున్నది. దేవబ్రాహ్మణగురుపూజాలోలయను విశేషణము వెండియు నావరవర్ణిని జాత్యుత్తమత నెఱింగించుచున్నది.

కృ...(జనాంతికముగా) అన్నా! ఏల? యిట్లు విచారింపక మాటాడెదవు

తే॥ గీ॥ కౌమరుప్రాయము సొబగులఁ ♦ గులుకుచేవి
మెఱయు కన్నియచెంగట ♦ మేరమీఱి
కౌమరుప్రాయము సొబగులఁ ♦ గులుకుచేవి
మెఱయు నీనరఋషి నుంచ ♦ మేలఁకువగునె॥

బ...(కోపముతో) ఏమీ నేనే విచారింపకమాటాడితినా?

ఉత్సాహ వృత్తము, }
వీరునిర్జితేంద్రియులు వి ♦ వేకమతులు సద్గుణా
ధారులిట్లు వీరినఁగఁ ♦ దగవె యఘముగమ్మదే
ధారుణీశసుతలు తొల్లి ♦ తాపసులభజించి చె
న్నారు కోరికలనుబడసి ♦ యవనిఁ గొనరె కీర్తులఁ

"మున్నుమనమేనయత్త కుంతీదేవికడ దూర్వాసుం డెన్నియో దినంబులు వసించె" నని వసుదేవాదులు సెప్పఁగా వినకుంటివా?

కృ...అన్నియును వింటిని నాటికాలంబిదికాదు కాన నీవేమనినను నా మనంబందుల కొప్పదు.

ఉ॥ వేలకొలందిగామన ని ♦ వేశనమందుఁగలారు బానిసెల్
వైళమయందు నేర్పరులఁ ♦ బంచి యతీంద్రునిఁ గొల్వఁజేయఁగాఁ
బోలునుగాని చెల్లియలి ♦ పొంతవసింపఁగఁ జేయఁ జెల్లునే
యాలరిచెయ్విగాదె "నిజ ♦ మాడిసనిష్ఠుర"మంచు జంకినన్॥

బ...(తనలో)దుడుకుతనము మీఱుచున్న దే,(ప్రకాశముగా)పూనికతో

ఉ॥ ఆలరిసౌదుగాక పర ♦ మార్థ మెఱుంగనివాఁడ సౌదుగా
కాలలనాని కేతనవనాం ♦ తరమందున నుంచవాఁడ నే
నీ లలితప్రభాకరుని ♦ నీ గుణమండను నీయతీశ్వరున్
బోలదటంచు నీవు ♦ పొరపొచ్చెములాడినఁ జెల్లదో హరీ॥

కృ...(కపటకోపముతో) అన్నింటికిని నిట్లు పెడకయ్యముగావించుచు న్నావు. అయిన నట్లేయుండుము. విపరీతంబుగఁ బరిణమించినఁగదా నాపలుకులఁ దలంతువు.

బ...తలఁచినఁదలఁతును లే (కంచుకితో) కంచుకీ! నీవిప్పరమపురుషున్ జెల్లియ సుభద్రకడకుఁ గొనిచని పీరుతపోధనులనియును గొలఁదిది నంబులు నీమందిరవనంబున నుందురుకావున పీరిమనంబరసి కైంకర్య ముఁజేసిన నీయభీష్టంబులీడేఱుననియును నేప్రొద్దును వారికి సహచా రిణివై యుండుమనియును నిట్లు మీయన్నలానతిచ్చిరనియును జె ప్పి పీరినటనుంచిరమ్ము. (యతితో) స్వామీ! తామటకు విచ్చే యుఁడు.

య...నారాయణ. (కంచుకితో నిష్క్రమించును)

బ....కృష్ణా! మనమింకఁగొల్వుఁ జాలింపుదము. (నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము,





# సుభద్రా కల్యాణము

## చతుర్థాంకము,

(తెరలో)

శా॥ నీరంబుల్ గొని చెట్లనీడలను నెం ♦ తే విశ్రమించెన్ బసుల్
నీరేజాకరముల్ మహోష్ణభర పా ♦ నీయంబులై యొప్పెఁ జె
న్నారెన్ ధార్మికసత్రశాల లతిథి ♦ వ్యాప్తంబులై భూభుజా
గారద్వారములందు జగ్ధసమయ ♦ క్వాణంబులే పొందెడున్॥

(ఇది చూళిక)

(అంత యతి భోజనముచేసి కమండలువుతోఁ బ్రవేశించి)

తే॥ గీ॥ యతినని సుభద్రచెంత న ♦ న్నరయక హాలి
యుంచె, మించె మరుఁడు వల ♦ పించి నట్టి
భామయే యొంటిపైఁ జాలఁ ♦ బ్రమద మెసగఁ
నారగింపఁగఁ జేయఁగ ♦ నగునె యోర్వ॥

ఆహా! భూలోక రాకాసుధాకరముఖుల నేకాక రసాతల సంచారిణు లగు బింబాధరలఁ బెక్కండ్రనుఁ గాంచితిని గాని యుత్ఫుల్లకమలామోద యగు నీ శుభాంగి పాటి బోటి నెందును గానకుంటిని.

ఉ॥ చందురు చంద మొందులకుఁ ♦ జాలనిదంచు వచించు ముద్దుమో
మందముపాఁప లేఁడు సరి ♦ యా సిరియారు మెఱుంగువేణికిన్
పందెము వేసి గెల్చు నల ♦ వాలుగు సోగల కన్బెడంగు లా
చిందము విందు మే కుతుక ♦ పెందిన భాగ్యము నొందుటెన్నఁడున్॥

క॥ కుందనము మేను ముత్యము
లందగఁగొను పలువరుస త ♦ ళ తళ్లు పొగ
డ్తందనరు తమ్ముమ్మలేనిఁ బ
సందగు సుందరి పదముల సరి ♦ రావచ్చున్॥

కొలఁది యెఱుంగక నేనీ సుందరి సింగారంపు తేకల లెక్కిడఁ బూనఁగా నదియెట్లు సాధ్యమగును. ఇఁక నేనీ లావణ్యనిధిన్ గాంచుట తీర్థయాత్రా ఫలమే. కాంచిన నేమి కామబాణానలంబేఁచి మనస్థైర్య స్తంభమున్ గాల్చుచున్నది.

తే॥ గీ॥ చారుముఖపద్మ కుంతల♦చంచరీక
భుజనవమృణాళ లోచనాం♦డజవతంస
వళితరంగాభిరంగ లా ♦ వణ్యసరసి
పాళిఁదేలిన మారశ ♦ రాగ్ని యడఁగు

అది సులభమా ?

ఉ॥ అందనిమ్రాని పండ్లయెడ ♦ నాసవహించి కరంబుసాఁచి తా
నొందుఁ బరాభవంబు నరుఁ ♦ డొయ్యన నేనటులా, లతాంగిపై
డెందమునిల్పి మాటికిఁ గ ♦ డిందిగ “గొంతెమకోర్కె” లొందనా
చందనగంధి సేకురునె ♦ చాలఁగనే నపహాస మొంద నే॥

దుర్లభంబైన నేజీవించుటెట్లు? నానాటికి వలపగ్గలమై యేను నీవను పాలించిన జ్ఞానంబుఁ బోనాడుచున్నది. ఇట్లు విశేషకాలముగడుపుట దుర్భరము: ఇఁక నన్నిటికిని నాశ్రిత రక్షకుఁడు కృష్ణుఁడు కలఁడు. లేదా, కృష్ణకుమారుఁడు మన్మథుఁడు కలఁడు. భగవన్, కామదేవ!

చ॥ కనికరమింతయైన మదిఁ ♦ గానక మాటికి వాడితూపులన్
గొనియిటు గుప్పుచేమిగుల ♦ గొప్పగ నెంచెదె మించుబోఁడి న
మ్మనమునఁగరంచి కూరిచిన ♦ మాటయు నుండదె? పట్టుఁబట్టినన్
జెనకఁగలేనె? నీరిపు న ♦ జేయుని రుద్రుని నేని పీఁకమైఁ

మోసము దేవకీకుమారి యిటను వచ్చువేళయైనది. నా యీ తల పోఁత యకొక్కమలి వినకుండుఁగాక ఇఁక యథాపూర్వంబుగ నీ యశోక వృక్షంబునీడకు జేరెదను. నారాయణ, నారాయణ (దృష్టినుంచి తనలో) ఆహా వచ్చుచునేయున్నది.

(సంతోషముతో)

సీ॥ గిల్కుగిల్కనుపల్కు ♦ కెళ్కుఁగులెక్కడుకల్కి
తళ్కందియలహాసు ♦ దారిఁజిల్క
రంగారు మేలిమి ♦ బంగారుకొంగుల
చెంగావిచీర మే ♦ ల్సిరి చెలంగ
చిన్నారి వన్నెల ♦ గొన్న ముత్యాలపే
ర్వన్నెలు వెన్నెల ♦ చెన్నుఁబన్న
గుప్పుగుప్పనఁ దావు ♦ లొప్పుకప్పురపుగం
దము చందమారాము ♦ తలముఁ గప్ప
తే॥ గీ॥ గొప్పకప్పునెఱుల కొప్పు ♦ నొప్పు జాజి
పుప్పములదండ మేటి తా ♦ వులను గుప్ప
వలపు కస్తూరి చుక్క బ ♦ ల్వలపుఁ గొలుపఁ
జిలుక చేఁజేరి రాఁదార♦సించె నారి॥

(యథోక్తముగా సుభద్ర ప్రవేశించి యుంచుక విచారముతో తనలో)

సీ॥ కఱవాయె నీరాక ♦ భరమాయె మరుపేఁక,
దరమా యబలనోర్వ ♦ ధారుణీంద్ర
నీలీలలను వీణ ♦ నేలీలఁ గొనిరాణ
నేవేళఁ గడపుదు ♦ భావజాంగ
రారాజునకు రేవ ♦ తీరాజు ననుబల్మి
నేరోజుననొ యీయ ♦ నెంచు దేవ
నినునమ్మి యీజీవ ♦ ముమ నెమ్మిగాఁ బ్రోచు
దును జుమ్మి రాజన్య ♦ తుహినధామ

తే॥ గీ॥ మారునకు మాఱుగాఁగ వే♦మాఱు నృపకు
మార! పూజింతు నిను బూర్ణి♦మారజనుల
సారతర మేదురకృపాను ♦ సార! వికచ
సారసాంబక! రమ్మ వే ♦ సారక వెస॥

(సందేహముతో నెడమకన్నదరుట నటించి)

తేగీ గీ॥ వామలోచన మదరెను ♦ బాటయందుఁ
బక్కితీర్చెను కనఁబడెఁ ♦ బాండువృషము
రుక్మిణీ సత్యభామలు ♦ రుచిరవచన
ములఁ బలికిరింట నిందలి♦ఫలమి దేమొ॥

[ధైర్యముతో) కానున్న ఫలమగును. ఇంచుకఁ బరిక్రమించియతినిఁ గాంచి సందేహముతో)

ఉ॥ కాంతునిరూపరేఖల వె ♦ కన్పడు నీయతి యందదేమొ నా
స్వాంతములోనఁ గూరిమియుఁ ♦ జాలఁగ నీతనియందుఁ గ్రాలు శు
ద్ధాంతమునందు నావదిన ♦ లాడిన మేలములే నిజంబొ నా
వంతముఁదీర్పఁగాఁ గడఁగి ♦ వచ్చెనొ మచ్చికకాఁడు మెచ్చఁగన్॥

అట్లు గాకున్న

ఉ॥ ఈ నగుమోము సోయగము ♦ లీ వగఁడాఁగునిగారి చూపు బా
గీనునుమేని మేల్మెఱుఁగు ♦ లీసుధఁ జిల్కెడు పల్కు బెళ్కు తీ
రీనయగారివర్తనము ♦ లీయెలప్రాయపు రామణీయకం
బానరునందుఁగాక నిఁక ♦ నన్యుల నొందుట యెందు విందుమే॥

ఉల్లమా! ఏల యీలీల బేలవయ్యెదవు. తపసియే నీ జీవితేశ్వరుఁడేని నీయన్న లెఱుంగకుందురా? ఎఱిఁగిన యెడ వీరి నొంటిగ నీ యొద్ద నుంతురా? ఇంతయేల ఆర్య పుత్రున కీ సన్యాసివేషంబేమి లాభకారి? నిక్కంబుగ నితఁడు జడదారియే వెగ్గలంబగు వలపిట్లుపన్నించు చున్నది. తారసించెదను. [సమీపించి భక్తితో) తపసిమానికమా! జోహారు సేయుదాన.

యతి—కల్యాణమగుఁగాక.

సు...సామీ! ఈనాఁటి ప్రదోషపూజకుఁ గావలసినవస్తువులెవ్వి?
యతి—కావలసినవస్తువులా. (మందహాసముతో)

క॥ దండలనుఁ గడుసోయగ
పుండాలు మెఱుంగును వల ♦ పునుగల చెండ్లన్
దండిగ మధురిమకిరవౌ
పండును నిడుమావెసన్ సు ♦ భద్రా! మాకున్॥

సు...[యతిఁగాంచి మోమువంచి సాలోచనయై తనలో] ఏమిది యతి యని మాయన్న లానతిఝడినట్లు సేవలఁ గావింప నితఁడు దృష్టి వాగ్వ్యాఖ్యలఁ దనవికారంబుఁ గనఁబఱచుచున్నాఁడు. నిద్దంబగు నాడెందంబునందునను నీతనియందీసుకలుగక ప్రేమయే పెరుఁగు చున్నది. ఇతఁడు నాజీవితేశ్వరుఁడుకానిచోఁ జొరవగా నిట్లుమాటాడ నాయుల్లంబునకు శాంతిపొడమదు.[ఇంచుక యోజించి] చిత్తమా? ఏల నీకీతత్తఱము ఇదియెల్ల సహజ మన్మథబాధితంబవగు నీవికారమే కావున సామియెడ నేరము సల్పకుము. (పుష్పాదులనిడును.)

యతి—[తనలో] సొంతముగా నీకాంతమంతనంబు నెఱింగినయెడల భవితవ్యతనుగుఱించి యోజింవనగును. కావున ప్రియవచనంబుల నద్దాని నారయుదును. (ప్రకాశముగా] దేవకీకుమారీ! అనుదినము నీవు సేయుచున్న యుపచారంబులకు నాడెందమానందంబునొందినది. నీకుఁగలకోర్కెలేవేనిఁ దెల్పినచో వాని సిద్ధింపఁ జేసెదను.

సు—(సిగ్గుగల సంతోషముతో) దేవరకరుణయే.
యతి—మేలుమేలు.

వసుంధరావృత్తము. కలాపూర్ణ!యిటులన్నఁ ♦ గనఁజాలనా
కులాలంకృతివటంచు ♦ గుఱుతించితిన్
లలత్పద్మహిమపాండ్వ ♦ లఘుకీర్తిపే
శలున్ భర్తఁగానెవీవు ♦ సరగన్ దగన్॥

సు—[సిగ్గుతో సంతోషముతో తనలో) పాండుకీర్తిపేశలుండనిన

సమాసపదంబు తత్పురుషవచనమో లేక కర్మధారయమో తత్పురుషవచనంబైనఁ దత్పురుష వచనంబగును. మఱచితిని, తపోధనులు త్రికాలజ్ఞానులు నావలపులకాని నేమంబీసామిచే నరయుదాన, (ప్రకాశముగా) సామీ! యొకవిన్నపము.

యతి—సందియమునువీడి యడుగుము.

సు—తామొనరించిన తీర్థయాత్రలో నేయేపుణ్యభూముల నేయే పట్టణంబులఁ గాంచితిరో?

యతి—కాంతా! కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రంబుల గంగాసరయూ కావేర్యాది మహానదుల, బదరీ నైమిశాది పుణ్యవనంబుల నతిభక్తి భజించితిని. శ్రీశైల, వెంకటాచల, హిమాచలాదుల సేవించితిని రాజధానులఁ జాలఁజూచితి. లెక్కడ నేల? పుణ్యతీర్థస్థలంబుల నన్నింటినిఁ గాంచితిని. సువర్ణముఖీసేవనంబిందు రమణీయముగాఁ గన్పట్టినది.

సు...(తనలో) కడపటిపల్కు లోకభంగిగా వినఁబడినవి. అరయుదును గాక. [(ప్ర) సామీ?

శా॥ ఏదేశంబున వృష్టిదోషములు లే ♦ కెందుఙ్ బ్రజారిష్టముఙ్
లేదేదేశమునందు శ్రీరమణి దా ♦ లీలామతిఙ్ వాసముఙ్
బాదుఙ్గొల్పె నెటఙ్ బరాక్రమకళల్ ♦ ప్రాముఖ్యముం జెందునో
యాదేశంబును బాండురాజతనుజ ♦ న్మావాసముఙ్ గంటిరే॥

య—అవు నింద్రప్రస్థదేశంబును గాంచితిని. కాఁచిన నేమి?

సు— క॥ ధీరులు బలశౌర్యమహో
దారులు లోక ప్రసిద్ధ ♦ ధవళ సమజ్ఞా
ధారులు పాండు ♦ మహీంద్రకు
మారులు స్థిరకుశలులే! స ♦ మంచితచరితా॥

యతి—కుశలులే, అయినఁ బాండవులకుశలవార్త నీకేల? బాలా!

సు...దేవర! పాండవులు నాకు మేనత్తకొమరులగుట విచారించితిని.
ఆపాండవులలోను

సీ॥ మగఱాలఁ బగడాల ♦ జగడాల నగఁజాలు,
చిగిఁగ్రాలు మైనిగ ♦ నిగలవాఁడు
తొగవిందుసొగసంది ♦ తగవిందునిగఁబొంది,
సొగసొందు నెమ్మోము ♦ జిగులవాఁడు
అలతుమ్మెదలదిమ్మ ♦ నలుపమ్మ వెలిఁజిమ్ము
బలితమ్ము కసులచె ♦ ల్వమ్ము వాఁడు
లలిదేనియలనీని ♦ నెలతేనివలపూని
సొలపీనుపలుకు మే ♦ ల్కులుకువాఁడు
తే॥ గీ॥ పైఁడితామరతూఁడుల ♦ పోఁడిమూర్పఁ
జాలువాలిక కేల్గవ ♦ మేలువాఁడు
వలపులకు నాటపట్టయి ♦ వఱలువాఁడు
కుంతికొండికకొమరుఁడు ♦ కూర్మికాఁడు,

యతి—(తనలో)

క॥ మైగగురుపాటు నొందెను
లేఁగులుకు మొగంబు కుర్మ ♦ లిప్తంబయ్యెన్
నాగొనబు లెన్ను చెలికిఁక
లోఁగూరిమియుండుటరుదె ♦ లోలేక్షణకున్.

మున్ను ద్వారకనుండి వచ్చెడు సర్వజనమును విశేషించి యగ్నిమిత్రుఁడును సుభద్రవిజయానురక్తయని పలుమాఱు నొక్కి చెప్పినను నేను నమ్మకుంటిని. ఇపుడీ కాంతామణియే తేటపఱచినది. ఇఁకను దెల్లంబుగ నెఱింగెద (ప్రకాశముగా) (చిఱునవ్వుతో) కొండిక కొమరుఁడన విజయ సహదేవుల కిద్దఱకు నర్థమువచ్చును. అందు నీవెవ్వనిఁగుఱించి చెప్పితివి.

సు— దేవా! మాద్రీకుమారుఁడుసహదేవుఁడు నాకు మఱిది మొదటివారిని గుఱించియె మనవి చేసితిని.

య... మొదటివాఁడగు యుధిష్ఠిరునిఁగూర్చియా,
సు... కాదు వారు నాకు బావగారు.

య...మఱియిఁక నెవ్వనిఁగూర్చి.
సు...కుంతీతనూజులలోఁ గనిష్ఠుఁడు,

య...అతఁడా! తెలిసెనులే. (సుభద్రతో] నీలాలకా! నీవాకవ్వడిని వలచితివా యేమి? కూడదుసుమీ.

సు...(ఉలుకుతో) ఏల.
య...శృంగార రేఖావిభవంబుల నీకాతఁడు తగినవరుఁడుకాఁడు.

సు...సామీ! తమ పలుకువ్యాజనిందయందన్వయించు సర్వథా సుందరీ మనోవిజయుండగు విజయునకు నేనీడు కాను గాని చుట్టఱికమునైన దలఁచి చేపట్టఁడా యని యెంచెద.

క॥ రూపరియని లేఁబ్రాయపు
చూపరియని హాయలఁ జిల్కు ♦ సొబగులకుఁ గడుఁ
దాపరియని నా బోంట్లకుఁ
గాపరియని విందు నతనిఁ ♦ గరుణా నిలయా!

య...[సంతోషముతో ఔరా! పలుకుల తీయందనము నారయ సత్కవుల కావ్యంబులందరతి పొడుముచున్నది. డెందమా! ఇఁక వందురకు. ఏయమృతాధరకుఁ గరుణకలిగిన నీవీ విరహతాపంబునంతరింపఁజేసి హాయి నొందెదవో యాసౌందర్యవారాశి కూరిమితో నీసోయగంబుల నిపుడు సైవారముచేసినది. (ప్రకాశముగా) ముగ్ధా! నీ వన్నటులే యొప్పుకొనినను బహుభామినీవరుఁడతఁడు నిన్ను వరించుటెట్లు? ఎట్టకేలకు నీ యనుతఁదాళిఁగట్టిన నీయందనురక్తుఁడగుట యెట్లు?

సు—మునిమందారా! నన్ను విజయుఁడు వరింపఁడందురా?

క॥ కనికరము డాసి కవ్వడి
నను జేయఁగలఁడు సుమి ధ ♦ నంజయుగతఁగా

య—కాదేని ?

సు— కనికరముఁ బాసి కవ్వడి

నను జేయంగలఁడు సుమి ధ ♦ నంజయగతఁగా॥

కావున ధనంజయ సాంగత్యము మాత్రము నాకుఁ దప్పదు. ఇఁకను వరించిన నాదక్షిణుఁడు నాయందుఁ బ్రియుఁడు గాఁడను సందియము నాకు లేదు.

సీ॥ వసుమతీముఖసతీ♦వ్యాసక్తుఁడు మ్యంతుఁగూర్చిఁ బెండ్లాడెశ♦కుంతలార్య
దేవయానాప్రముఖ♦దావహు నాయయాతిఁగొనె శర్మిష్ఠ♦దివ్యచరిత
కోసలకేకయ ♦ వాసూత్క్రదశరథుఁ,రక్తిఁ జేకొనె సుమి ♦ త్రా సుశీల
రోహిణీప్రముఖావ♦రోధుని వసుదేవుఁ, బడసెనాతల్లి దే♦వకి గుణాఢ్య

తే॥ గీ॥ ఆవరారోహలెల్ల నా ♦ యంతమేధ
లేనివారలె? విభవము ♦ లేనివారె?
గాసిఁజెందిరె? సుఖయశో ♦ గతులఁగనరె?
బహుకళత్రులఁ జేపట్టి ♦ భవ్యశీల?

(తనలో)

య...మనమా! నిర్మలంబగు నీ గుణోత్తమ చిత్తంబిపు డెఱింగితివి క దాసుదినమిది. [ప్రకాశముగా] చక్కెర బొమ్మా! ఇంతటిపూనికయున్న నీ వింతదనుక నా నరులనేల చేపట్టవు!

సు...ఆర్యచరితా! గురుజనాంగీకారమునకై వేచి యిట్లున్నదాన.

య...ఇఁకను మాత్రము నీ గురువులు ప్రతికూలించిన నీ వేమి చేసెదవు?

సు...గురువులెల్లఁ బ్రతికూలించెదరా? ఒక బలభద్రుఁడు ప్రతికూలించును

య...బలభద్రుఁడేల ప్రతికూలించును?

సు...అతఁడు నన్ను దుర్యోధనునకీయ వలెనని పట్టుఁబట్టియున్నాఁడు

య...(మందహాసముతో) ఓహో! మంచిమనువు నాలోచించి నాఁడు అందులకు నీ వొప్పవలసినదియే! దుర్యోధనుఁడనఁగ నేనుని కొంటివి. రారాజు ఐశ్వర్యశాలి అర్జునుంగట్టికొనిన నీ వేమి వావుకొనియెదవు!

సు...సామీ! అతని గొడవ నాకు వలదు. అతఁడు నాకు దాయ. నా కర్జునుఁడే పెనిమిటి.

య...నిక్కముగాఁ జెప్పుము.
సు...నిక్కముగా, ముమ్మాటికిని.
య...వెఱ్ఱిదానవులాగున్నావు.
సు...ఏల ?
య...బంగారు పాఱవేసి ప్రబుసి రాతిని మూటఁ గట్టుకొనుచున్నావు.
సు...లేదు. చిల్లపెంకును పాఱవేసి విలువగల వజ్రమును మూటఁగట్టుకొనుచున్నాను.
య...ఎట్లు ?
సు... తే॥ గీ॥ వజ్రములచాలు మెయిడాలు • వజ్రములెన
ఖమ్ములగు, వజ్రములె రద • నమ్ములునగు
వజ్రములె, మేలిగొనములు • వంద్యచరిత
వజ్రికొమరుఁడు విను రాచ • వజ్రమతఁడు॥
య...నీవన్ని యతిశయోక్తులు.
సు...స్వభావోక్తులకుఁ గూడఁ దీసిపోవునేమో
యతి...విలువగలనగలు పట్టుపుట్టములు ముత్యాలహారములనేకములు రారాజును వరించినఁ బడయఁగలవు. మఱియు నీయిలాతలంబునఁగల రాణులలో నగ్రపీఠము నెక్కఁగలవు.
సు...సామీ ! నే నగలు మొదలగువాని నాసించుదానఁగాను. అట్లే దొరసానులలో నెక్కుడుగద్దె నెక్కవలెనని యూహకూడనాకు లేదు రాజవంశ్యులకురువైనతోడవు విక్రమము అందసామాన్యుండనెడు కీర్తికిఁ దావలంబైన యగ్గిర్వాణరాజనందనుం బెండ్లాడెదను.
యతి...ఈలోపల మీపెద్దయన్న రారాజునకిచ్చి పెండ్లిచేసిన నీ వేమి చేసెదవు ?
సు...(విచారముతో) అందులకే లోలోపల మిడుకుచున్నదానను. ఆ మిడిమేళపుదొరనన్నేచుటకై పుట్టెనుగాబోలు. కానిండు, అట్టితరుణము సంభవించినయెడల నప్పటి నాగోడు దేవరకుఁ జెప్పికొంటిని గదా? ధనంజయాశ్రయమే. అట్లుకాక యీలోపల (ధైర్యముతో)

క॥ విజయుఁడు సముపాత్తజగ
ద్విజయుఁడు కృపఁదారసించి ♦ వే నన్నుగదా
గ్రిజమతమునఁగొనిచనఁడా ?
నిజనిర్మలచరణగతుల ♦ నే విడఁగలఁడా ?

య...అట్లయిన నాతఁడిప్పటివఱకు నిన్నేల చేపట్టకుండెను?

సు...ప్రస్తుతము నాదయితుఁడు వత్సరమునుండి స్వదేశమునువీడి తీర్థయాత్రఁ గావింపుచున్నాఁడు.

మత్తకోకిల. ఓమహాత్మక! పుణ్యభాజక ♦ యోజనీయచరిత్ర! సు
త్రామతేజ! భవాదృశుల్ సుకృ ♦ తప్రభూతసమాగముల్
తామగాంచిన పుణ్యభూముల ♦ దర్పకాధికసుందరున్
నా మనోహరు నానరుఁగనినారె? ♦ నాకిఁకఁదెల్పరే!

యతి...[తనలో] ఇపుడేమనువాఁడ. నిజముదెల్పిన నిక్కఁశల నన్ను గుఱితించి యాదరించునో వేఱుగాఁదలంచునో. (ప్రకాశముగా)

ధ్రువకోకిలవృత్తము.

మలయభూధరమందుఁ గాంచితి ♦ మందయానరో! నీమనః
కలితు, నేనతఁడన్వికారముఁ ♦ గానకుంటిమిచెల్మిమై॥

సు...(తనలో) రెండవపాదంబు తెఱంగు వేఱొకభంగిగాఁ బొడకట్టుచున్నది. అగుఁగాక. (ప్రకాశముగా)

మలయభూధర మెంతదవ్వు? సు ♦ మారు మాదగువీటికా
లలితుఁడీయెడకిప్పురాకఁద ♦ లంచెనో మదినెంచఁడో॥

యతి... మత్తకోకిలలు.

చానరో! యనుమానమేమిఁక ♦ సత్యముర్ వివరించెదన్
మాని సందియముర్ నిజంబని ♦ మమ్ము నెమ్మదినమ్మినన్

సు... మానిచంద్రమ! దాసురాలను ♦ మానమొందునె మీయెడన్
పూని ప్రేమమతిన్ మదీయవి ♦ భూతిబీజముఁ దెల్పినన్

యతి--సుందరీ! యిటనున్నవాఁ డిఁకఁ ♦ జూడు నీహృదయేశ్వరున్
ముందఱన్ గలవానిఁగా సక ♦ మోసపోవుదు రేయిటుల్॥

సు— మందె మేలములాడఁ బాడయే? ♦ మాటికిన్ మునిచంద్రమా!
సందియంబడఁగంగ దేవర ♦ సత్యమున్ వివరింపుమా!

యు—[తనలో] నాయందీ సుందరికిఁగల యనురాగవేగము నన్నిఁకఁ గాలవిలంబముఁ జేయనీయదు. (ప్రకాశముగా)

శా॥ కాంతా! సందియమేల నిన్నుఁ దఱియం ♦ గాఁజేతి నీతోడ నే
కాంతంబందున నీ మనోగతము లా ♦ కర్ణించి గాంధర్వమం
దంతస్తాపముదీఱ నిన్గలయ జ ♦ ట్యాకారమున్ బూని శ్రీ
కాంతున్ వేఁడునరుండితండు సుమిరా ♦ కాపూర్ణచంద్రాననా!

సు—[భయహర్ష లజ్జాక్రాంతయు నాకంపస్వేదరోమాంచితయునై తన లో] ఏమి! నా జీవితేశ్వరుఁడా? ఐనచో నా భాగ్యరేఖ ఫలించెను గదా. లేక కుటిలదానవుఁ డెవఁడేని నన్ను వలచివచ్చి యర్జునుఁడ ననుచున్నాఁడా? అటులేని వీని యింద్రజాలంబున నాయన్నలు మోసపోయి యుందురు. ఇందున నితని బెదరించి నిజం బరసెదను (ప్రకాశముగా) ఓ మాయపుజడదారి! గారడిమాయల మాయన్నల వంచించి నా యంతిపురముఁ జేరి నాచే నూడిగంబులఁ గాంచి కడ కిపుడు గర్వడిన నెదవా శూరసోదరిననియును వీరభర్తృకాంక్షిణి ననియును గుఱుతెఱుంగవా?

చ॥ ఎఱుఁగవె? రామకృష్ణుల న ♦ హీనపరాక్రమశౌర్య జిష్ణులన్
దురమున మేటిగా వినవె ♦ దూరిత శాత్రవఘాటి సాత్యకిన్
బిరుదపుధూర్తులన్ గనవె ♦ భీకరయాదవశూరమూర్తులన్
దిరమగు కీర్తినొప్పు వసు ♦ దేవుని నార్యునిగాఁ దలంపవే?॥

మఱియును.

క॥ ఇటనెవ్వరు లేరని కద
కుటిల! తలంచితివి! చేరఁ ♦ గూడుదు రిపుడే

చటులారిమకుటఖండన
పటులాద్యులు వేనవేలు ♦ పాలకభృత్యుల్ ॥

—(తనలో) అహో ముద్దియ నన్ను గుఱుతింపకున్నది వేగ నీ యుంగ
ంబున సందియంబుఁ బాపెద (ప్ర) యాదవకుమారీ!

తే॥ గీ॥ కాను గారడివాఁడను ♦ గాను దపసి
కాను రక్కసి నిసుఁగోరి ♦ కారణాంత
రమున యతివేషినైన భా ♦ రతవిజయుఁడఁ
బాయుమీ సందియం బంగు ♦ ళీయకమున॥

కక్షపాలనుండి తీసి యుంగరమీయఁగా సుభద్ర యుంగరమందలి
న నామము నుంగరమున కనువగు వ్రేలిఁజూచి పులకించి తనలో)
! ఎంతసుదినము ఎంత నా యవివేకము కట్టెదురనున్న ప్రాణ
దన్నుఁ దాఁ దెలుపుకొనినంతవఱకుఁ దెలియలేకుంటి.

తే॥ గీ॥ ఆరగించెడుతఱి మాట ♦ లాడుతఱిని
నిదురబోయెడుతఱి ♦ నొంటినిష్ఠనున్న
తఱినిఁగని యార్యపుత్రుఁడే ♦ తిప్పకితఁడ
టంచు నెంచుదు మఱి సంశ ♦ యించుచుందు॥

 సందియము నేఁ డార్యపుత్రుఁడే తీర్చి తన్నుఁ దాఁ దెలిపికొనియె

మ॥ అవధానంబునునొందుమా మనమ! సూ♦నాస్త్రా! క్షణంబూరకుం
డు వనంబో విజనంబు నాదుసఖులుఞ్ ♦ జూడంగ రారే లోకో
భవనంబారయ దూతమార్యుఁడును శుం ♦ భత్పద్మబాణార్తుఁడై
కవయఞ్ గోరుటఁదోఁచుఁజిత్తము నెటుల్ ♦ గా పాడిరా పాడుదుఞ్

గా యంతరంగమందు నాసర్వస్వం బీయన యధీనము చేసినను
జనమున కెఱుకలేక గాంధర్వంబున కొడంబడుట రాచకన్నియల
-దు పరువు కాదు. కలఁడుగదా కల్పతరువునకెనయైన చిన్నయన్న

ఆతఁడె మేలుగూర్చు నేనికఁ నంతిపురమును జేరెద. [పరిక్రమించు చుండగా)

అ...(చే యొడిసి పట్టి)

ఉ॥ ఏటికిఁ యిమ్మెఁ జేరుటది ♦ యేఁటికి జాలము? బాలయేలుమా
రాటము నొంది యుంటిమి వి ♦ రాళికరంబు భరంబు సైఁప మీ
నాఁటికిఁబూర్తిసేయుము! ఘ ♦ నంబగు మారునియుగ్రఘాటి నా
మాటను విశ్వసించి కను ♦ మా! యనుమానము మాని మానినీ!

మురిపములమూటా! నిను నారాణిగ వరించి నీ సాహాయ్యంబున నిమ్మారుని జయింపనెంచు నాకు నీకేలూఁత నొసంగవా? నినుగోరియే కదా! నేనీ మాఱువేసముఁదాల్చి నీకడ నిట్లు రహస్యంబుగ వేచియుండుట. విక్రమము తక్కి యుంటిననుకొందువేమో! యాదవుల నందఱి నోహటింపఁజేసి నిన్నుఁ గొనిపోయి రాక్షస వివాహం బాడఁగలను. గాని త్రివిక్రముని యందలి చెలిమికి భంగము రాఁగూడదను తలఁపున నిట్లున్నవాఁడ. ఇఁక ననంగుండును. దృష్టిపథంబునఁ బడకుండుటఁ జిక్కక నన్నిట్లు గారించుచున్నాఁడు. ఇపుడు జగన్మోహనాస్త్రంబవగు నీయనలంబనంబున వానిఁ బాఱఁదోలెదను, మాటాడవేల? కోపమా! నిన్నే జీవధనంబుగ నమ్మి నాచరిత్రంబంతయు నీతోడఁ గడపనెంచెడు నాయందిదితగునా? సిగ్గుపడెదవేమో దానితోఁ బ్రయోజనమేమి? లాఁతివాఁడనా? చిన్నతనంబున మన మాడుకొనిన దాఁగిలిమూఁతలేనిఁ దలంపునకురావా? అక్కటా త్రపయెంతగొప్పదినిందుకూరిమి నాయందు నుంచి నన్నువరించిన నిన్ను నిముసములోఁ దనకైవసంబు చేసికొని మాటాడనీయకున్నది, దీనిఁ బాఱఁదోలుట కేమి యుపాయము! (చిలుకను గని] రామచిలుకా! పనికిమాలిన సిగ్గునఁదోఁగు మీరాణికి బుద్ధులఁగఱపి నీవైనఁబల్కరింపఁజేయవా? మీ పూర్వులేకదా! తొల్లి రాకన్నియలఁ గఱచి కాంతులకుఁ గూర్చినది. నేఁడు నీచాతుర్యం బగుపఱచి యీ నావల్కుల కుత్తరం బిప్పింపుము!

ఉ॥ కావలుఁడైన మన్మథుని ♦ కాఱియఁ కోరువలేక నీకడన్
సేవగమీఱియుంటి నను ♦ నీవిఁక శూరసహోదరీ! కృపన్
నావలవంత దీర్పుమను, ♦ నమ్మినవారల నెమ్మిఁగాచుటెం
తో విధిరాజకాంతలకుఁ ♦ ద్రోయకుమంచు వచింపు మింపుగన్॥

సు....(తనలో) ఇందుల కుత్తరంబీయకున్న సితరుణుం డీతరుణంబున నన్ను విడువఁడు. (ప్రకాశముగాఁ బలుకతో) చిన్ని చిలుకా!

ఉ॥ జోతలఁ జెప్పుమా యిటకుఁ ♦ జూడఁగవచ్చిన ప్రేమకెంతయున్
జేతులమోడ్పులంచనుమ! చెన్నఁటి మారునిచేతఁ జాలనే
గోఁతలనొందుచుండినను ♦ గూడుని చేకొనఁగా స్వతంత్రతన్
బ్రాఁతిగ నార్యులే మన వి ♦ వాహము సేయుదురంచుఁబల్కుమా॥

అ...ఓ నా రాణీ!

క॥ ఎప్పుడు గురుజను లెఱుఁగుదు?
రెప్పుడు సేయుదురు పెండ్లి? ♦ యేటికి మనకా
తిప్పలు గాంధర్వంబున
కొప్పుము దప్పింపు మంగ ♦ జోద్ధతి నిపుడే॥

మఱియును.

తే॥ గీ॥ వేళమీఱిన పిమ్మట ♦ విందు భోజ
నమును రుచియింపదొక్క శా ♦ కముననైన
వేళకిడు భుక్తితనివి గా ♦ వించునెల్ల
జనము "లాలస్య మమృతం వి ♦ షం"బనుదురు

సు...చ॥ తగవిదికాదు శూర! పర ♦ తంత్రను

అ... ముద్దియ! సెప్పు మెద్దియో!

సు...తగవసుదేవకృష్ణుల మ ♦ తంబునన్ గ్రహియింపుమార్య!

అ... వే

ఱుగ నను నెంచి బ్రాహ్మవిధి ♦ రూపణ జేసెదవేల! బాల! ...

సు... భూ

జగసతులఁ దరేందుని వ ♦ రింపరే? బ్రాహ్మవివాహపద్ధతిఁ

అ...ఓనాని క్షేపమా! ఈ గాంధర్వంబునను బలువురు రాజర్షులు మున్ను రాచకన్నియలఁ బెండ్లాడి యున్నారు. అందసమాన విక్రముని నొక్కనివినుము.

శా॥ శాంతిఁ దాంతి మహాకులీనతఁ గళా ♦ చాతుర్యసంపత్తి వి
క్రాంతిఁ మీఱి సమస్తభూవలయర ♦ క్షాదక్షుఁడై నట్టియా
శాంతప్రస్ఫురితాతివేలనిజవిఖ్యాతి ♦ ప్రకాశుండు దు
ష్యంతుండీగతి నేవరించె నల విశ్వామిత్రపుత్రిఁ జెలీ॥

కావుననిఁక జాగుమాటలఁ జాలించి చాలఁగ విరులరాలిచి మనకై సెజ్జఁగూరిచిన యిమ్మాలతీనికుంజంబుఁ గాంచుము.

సు...[తనలో] ఇఁక నిపు డార్యపుత్రుఁడుసామమ్మున నన్ను విడువఁడు.

(కాలందెలమోగించి తెరవంకఁగాంచి)

కర్పూరికా! వచ్చితి. వచ్చితి. [అర్జునునితో]
పుడమితేఁడా! చెలులరుదెంచిరి విడుము, విడుము.

(అర్జునుఁడు చేయివిడువఁగా సుభద్ర వేగముగాఁబోయి యాప్రదేశంబునకుఁ గొంతదూరముగానున్న పూవుల గురివెందల పందిటఁ గూర్చుండును.)

అ...[నలుగడలఁజూచి విస్మయముతో] హా మోసము రాచకొమరిత, సఖీవ్యాజంబునస్థలాంతరంబున కేగినది. ఇఁక నేనీదుస్తరంబగు విరహార్ణవమందు మునుంగవలయును గాబోలు. లేక నాయాకులపాటుఁ జూడ వేడుకకై యిందుఁ బూఁబొదలమాటునఁ డాఁగియున్నదేమో కాంచెద,

(వనమువంకఁ గాంచి అనుత్సాహమును జూపుచు) ఓహో ఇది యెట్లు సాధ్యము.

తే॥ గీ॥ తరుణసుమగుచ్ఛరుచిరల • తావితాన
మండితము కీరకలహంస•మంజు ఘోష
సంగతమునగు వనసీమ•సతి లతాంగిఁ
జూపుకాదంబవచనఁగాం • చఁగఁ దరంబె?

ఈ మాత్రులుల నడిగిచూచెద.

మ॥ కనినారా? వనశాఖులార! యదురా • ట్కన్యన్ సుభద్రాసతిన్
ఘనశీలాలకజాలకన్ గలితరా • కాపూర్ణచంద్రాననన్
గనదిందీవరలోచనన్ రుచిరకే • ళన్ పక్వబింబాధరన్
దనుమధ్యన్ ద్రివళిన్ బ్రవాళచరణన్ దం • తీంద్రసంచారిణిన్॥

(పరికించి) లేదిట శుద్ధాంతమున కేగెనేమో! అక్కటా, ఇఁక నేరీతి నిమ్మారశరాధినీరధిన్ దరింతు ఏవిధమ్మున జీవితమ్ము నుద్ధరింతు కార్ముకముఁ గేలనూని శుద్ధాంతంబునకుఁ జని రాతనయన్గొని యెదు రగువారలనెల్లఁ జాపంబునకు బలిఁగావించి యింద్రప్రస్థంబును జేరు దునా! అటులైన వాసుదేవుని మదికి దూరమగుదునుగదా! అక్కటా నిక్కంబుగ వలచిన చక్కరబొమ్మగదాయని నానిక్కంబును దెలిపి వేఁడ దయార్ద్రమతిఁగాంచక యక్కఠినహృదయ నన్నిట్లు వెతలపాలంబ అచిచనె.ఒడలంతయుఁ బాషాణమయంబుగాన నార్ద్రమతి యాగరితకెట్లు గల్గు! విధీ నీవు శిల్పివికావా?

చ॥ మునుకొని పద్మరాగమణి • మోవిని, వజ్రములన్ రదంబులన్
గనదురునీలరత్నతతిఁ • గైశ్యము నద్దపుజాలఁ జెక్కులన్
ఘనగిరులన్ జనుంగవ, ర • కంపు ప్రవాళములన్ బదంబులన్
బొనరిచి డెందమున్ సలుప • మోసముఁగాంచెదవన్న నవ్వరే!

(తెరలో)

తే॥ గీ॥ పుష్పలిడాత్రజొకఁడు మరుల్ • బూనిడాసి
వలపులన్ గాంచి హరుసించి • వరుసవిూఱి

మధురసాస్వాదనంబు సం ♦ బరముఁ జెందఁ
బద్మిని మొగిడ్చెఁ గాలవి ♦ భంజితయయి.

అ...(విని) ఏమీ! ఎవఁడో నన్నుఁబోలిన మందభాగ్యుఁ డొకఁడు వలపులుగల పద్మినికిఁ డాయ నది మొగిడ్చెనఁట మఱుగుననుండి యెవఁడేని నాయుదంతంబంతయుఁ గని విని నన్ను హాస్యముసేయుట లేదుకదా! ఇఁకను వినియెద.

[తెరలో]

ఉ॥ ఓ చతురాళి! యేల? యిటు ♦ లూరక వాకొన నిష్ఠ కాలలీ
లాచరణార్థమై బిసిని ♦ హార్దము నంతయుఁ దాచియిట్లు సం
కోచమునొందె నింక హరి ♦ గూర్చెడు మోదముఁగాంచి వేగ వ్యా
కోచమునొంద నొందుదువు ♦ కూర్మలఁ గొందలమొందఁబోకుమీ॥

హాస్యముసేయుటకాదు. శ్రీకృష్ణప్రేరితులై కాఁబోలు వైతాళికులు నన్నూఱడింప సరోజినీభృంగవ్యాజంబునఁ గాంత యనుకూల యనియును గాలవశయై సంకోచమునొందినను హరిమోదితయై తిరుగ వికాసమునొందఁగా సౌఖ్యంబుల నొందుదువనియును జెప్పుచున్నారు. అయిన నీపద్మినీకకనుపుగ నిదిసాయమా? (ఆకసమునుజూచి) అగును సందియమేమి?

క॥ రక్తుఁడయి యినుఁడు పశ్చిమ
దిక్తన్వినిఁ జేరనతనిఁ ♦ దృఢపరిచయసం
సక్తయయి వేగముగ నను
రక్తయగుచుఁదనరె నది వి♦రాజద్గతులన్.

(తూర్పుదిశఁగాంచి) ఆహా.

సీ॥ పౌర్వదిగంగనా ♦ భాసురధమ్మిల్ల,
కలితచామీకర ♦ కమలమనఁగ
గాలగోపాంగనా ♦ కాశఘటక్షిప్త,
నిర్మలతర నవ ♦ నీతమనఁగ

దరుణమనోదార్ఢ్య ♦ తర్జనాగతకామ
దేవార్థవిహిత ప్రి ♦ యవమనంగ
విష్ణుపదాపగా ♦ కేళీవిహారసం
చరణాఢ్యరాజహం ♦ సంబనంగ

తే. గీ॥ గగనచరదమరాంగనా ♦ కరవిగళిత
కాంతసంతానసుమకందు ♦ కంబనంగ
కైరవిణిపుణ్యఫలభర ♦ కల్పమనంగ
బ్రాగ్దిశ నలంకరించె ♦ వాత్మ్యకుండు॥

నేనీ రాగవశంబున, సంధ్యావర్ణనంబుఁ జేయుచునే సంధ్యావందనంబును మఱచితిని. వేగ ననుష్ఠానమునకై చనియెద [నిష్క్రమించును.]

సు...(తనలో)

ఉ॥ రాఁడుగదా మనోహరుఁడు ♦ రాయిడిమానఁడు పుష్పబాణుఁడా
"వేడుకకానిఁదే నరుగ♦వే శుకమా" యని తొందరించునే
నేఁడు ప్రియుండు దాసి "తగు♦నే యిటుజాలము బాలయేలు" మం
చాడిన పేడివచ్చితిని ♦ హా యిఁక నేమి యొనర్తు నిత్తఱిన్॥

మందమతీ! నీ కాంతుండు నీకష కరుదెంచి ప్రియవచనంబుల నూరడించి నిన్నుఁ గల యఁగోరఁగా వెగ్గలంబగు సిగ్గుతో నాసుందరు డెందంబలరఁ బ్రియముగ నేని మాటాటక మాయఁగడఁగి వీడి వచ్చితివిగదా! "బాలా! దెప్పరంబగు విరాళినోర్వక క్రుంలము కామ"నిన యవనీజాని యెట్లువేఁగు చుండెనో, నీగతిమాత్రి మేమైనది. రేఱేఁడు ముందఱ నడిచి దివిటీ పట్ట శుకపికాళులు చెలఁగి సింహనాదంబులఁజేయ నంపన్న దక్షిణమరుత్సహాయుండై శంబరాంతకుండు విప్రయోగులను దండింప వచ్చుచున్నాఁడు.

సీ॥ మదిసుంతయును గొంకు♦మాని డాసియొయారి!
యేలుమాయనఁగనే ♦ ర్పెఱుఁగనైతి
"నినుఁగోరియే ద్వార ♦ కను జేరితినిజుమీ

సుందరి"యనఁ బాఱఁ ♦ జూడనైతి
మాటాడకున్న "కొ ♦ మ్మా! పెఱవానిఁగాఁ
దలఁతువా" యనఁ జెల్మిఁ ♦ దలఁపనైతి
"జాగేల సకియ యీ ♦ జాజిపూఁ బొదల ర
మింపుమా" యన సమ్మ ♦ తింపనైతి
తే॥ గీ॥ బాహుమూలంబు సోఁకఁ జే ♦ పట్టి "వట్టి
మాటలింకఁ జాలు రమ్మురా ♦ మా!" యటన్న
నింపులీడేఱ బిగికౌఁగి ♦ లీయనైతి
గోలనైతి మనోనాధుఁ ♦ గోలు పడితి॥

చిలుకా! నాచేతనున్న నీవైన బుద్ధిఁగఱపి కాంతునకుఁ దార్పవైతివి గదా! మరువారువంబవగు నీవింతటి యుపకారంబున కొడిఁగట్టుదువా? అంతరంగంబగు నా యంతరంగంబె యిట్లు మేరమీఱు.

సీ॥ కలుగునో కలుగదో ♦ తళుకు చెక్కులసామి
కపురంపువిడెపుఁ జొ ♦ క్కమగుముద్దు
కలుగునో కలుగదో ♦ కలికిచన్గవఁగాంతు
చే రాణమీఱు క ♦ స్తూరిపూఁత
కలుగునో కలుగదో ♦ కర్ణంబులకుఁ బ్రియ
కండ చక్కెరలీను ♦ కల్కిపల్కు
కలుగునో లేదో నా ♦ ల్కకురుచ్యమగు తేని
తావిచెంగావిలే ♦ మోవితేనె
తే॥ గీ॥ కలుగునో కల్గదో చెలి ♦ కానిమేని
గాటమా నల్లి బిల్లిక ♦ కౌఁగిలింత
లకట తఱిఁబోసి యీరీతి ♦ నాసడాసి
భీతినార్వంగ గనమ పా ♦ పిష్ఠమనము॥
హా! నాకీ విరహాదుఃఖమే తోడు ప్రాణసఖులేనిఁ దారసింపరైరి.
(సుభద్ర పూలపానుపునఁ బవ్వళించును.)

(మాలతికయు, మధుకరికయుఁ బ్రవేశింపుదురు.)

మా—[చూచి] చెలీ! మధుకరికా! మనరాకకై గుమ్మమునుఁ జూచు చుండు నెచ్చెలి కన్పట్టదేమే?

మ—అభ్యంతరగృహంబున నున్నదేమో! (మాలతికతో బరిక్రమించు చుఁదనలో) ఇందునను సఖిలేమి పికాళియుఁ బలుకయు వన్నెతఱిగి యున్నవి. ఎందేగియుండునో! నేఁటివెన్నెలలోఁ "జదరంగమాడుద మని" నేఁబలాత్కరింపఁగా ననుమతించియు నిటకు రాకుండుటకుఁ గతంబేమైయుండును? "తపసియొద్దయున్నదేమో!" యనుకొందమ న్న నిపుడు జాముడాతిరిమైనది. ఇంతదనుకననుండదు ఇఁకనీ సామియాకారముఁ జరికింపుచున్నకొలఁది నామది కొంచెపుకవిధము గాఁ బొడకట్టుచున్నది. ఇతఁడొక వేళ నభికయతియగు కికిటికాఁడు గదా? నిశ్చయింపఁజాల. తెలియకపోవునా? (మాలతికతో) చెలీ! ఇఁక నమ్మాధవీలతాశాలకుఁజని యచటనేని సఖిఁ గాంచుదము. రమ్మా! (ఇంచుక పరిక్రమించి) కాంచితివా! చెలీ! మంచునఁగొట్ట బడియున్న తామరతీవెఁబోలి యీబాలిక యలరుపానుపున మైమ ఱచి పవ్వళించి యున్నది. [సమీపించి కూర్చుండి] సఖీ! సుభద్రా! లెమ్మా సఖులము,

మా—నిదురింపుచున్నదే. (మీఁదచేయివేసి) అబ్బా దీనికెంతజ్వరము వచ్చినదే!

మ—జ్వరమా! (చేయిఁజూచి) విషమజ్వరమువలె నున్నదే! అరయు దునుగాక. (వేఱొక చెయిచూచి ముందు చూచినచేయి మఱల చూచి) (ప్ర)

తే॥ సీ॥ సందియంబేల వినుమిఁక ♦ సకియ కిపుడు
వెగ్గలంబయ్యె మరుచింత ♦ వేగిరంత
విరహరంబుల గురిసెడు ♦ వేఁడిఁ బొరయు
మన్మథ జ్వరమిది సుమ్మి ♦ మాలతికరో॥

ఇది నిద్రావస్థయుఁ గాదు. మూర్ఛయే యగును.

మా—చెలి! నీవు బాల్యంబున వైద్యశాస్త్రంబునుగూడఁ జదివితివి గదా. ఈ జ్వరమునకుఁ దగిన యౌషధంబుఁగూర్చి నెచ్చెలి కారోగ్యము సేయుము.

మ—సఖీ! బెదరక వినుము.

తే॥ గీ॥ మఱియు వినుమమ్మ! యీవిష ♦ మజ్వరమున
శీతకరదోషమును బాల ♦ వాతదోష
మునుసమావేశమొంది బా ♦ ధనునిగుడ్వ
సన్నిపాతంబనఁదగు ని ♦ స్సంశయముగ॥

మా—మధుకరికా! చెలి కెంతటికష్టము దాపరించెనే నేనేమి సేయుదు. నాయొడలు కంపము నొందె. ఎటుల రక్షించెదవే సఖిని.

మ—నెచ్చెలీ! సుభద్రఁ బోలి నీవును విరహావస్థ నొందనే సుభద్ర కుపచారము సేయుదునా నిన్నుఁ దేఱుచుదునా?

మా—పరిహాసమేటికే! నేభయంపడితిని సుభద్రకారోగ్యమైన నన్నొకరు తేల్పవలయునా?

మ—అయిన విను మావిషమజ్వరంబు నాయకసమాగమంబునఁదక్క నౌషధంబులఁ జక్కపడదు.

మా...మధుకరికా! విజయునిరాక కలవుగదా! నేనేమిసేయుదును? ప్రస్తుత మీయమ శైత్యోపచారంబున నారోగ్యముఁ జెందదా?

మ...అత్యనంగాగ్నితప్తయగు నీమెకిపుడు శైత్యోపచారం బెక్కుడుహితముకాకున్నను దాత్కాలికశమంబు నేని నించుకరచింపదా? అట్లైన

మ॥ కనులన్ దామరతేకులన్ గపురమున్ ♦ గండంబులన్ వాతెఱన్
ననతేనెన్ జనుదోయియందలరుచెం ♦ ద్లన్ జేతులన్ దమ్మిలన్
బొనరుం బాదములందుఁగొ్రింజిగురులన్ ♦ బొందించి మేనంతఁజం
దనగంధంబునలందుమమ్మ సఖిశై ♦ త్యంబంద బింబాధరా!

మా...అట్లొనరించెద.

మ...(చూచి వేగముగా)

భుజంగప్రయాతవృత్తము.

సఖి! లెమ్ము లెమ్మా ♦ సఖుల్ వచ్చిరమ్మా
సుఖం బేగదమ్మా ♦ శుభం బాదుకొమ్మా
ముఖం బేటికమ్మా ♦ ముదం బొందదమ్మా
సఖా! యర్జునా! మా ♦ సఖిన్ గావరావా!

సు...(కనులు తెఱచి సఖులు గన్పట్టఁగా సంభ్రమముతో) సఖులారా! నిదురించితి. వచ్చితిరా?

మ...సఖి! సంభ్రాంతవు కాకుము. వచ్చిన నేమాయలే.

మా...నెచ్చెలీ! ఇంకను నేల దాఁచెదవు? నీ వేసము మిఱిమీఱుచున్నది మేమా ప్రాణసఖులము. కలరీతి దాఁచక మాకెఱిఁగించినగాని నీకీ ముప్పుతప్పదు.

సు...(సభ్రూభంగముగా) ఏమెఱిఁగించమందువే?

మ...చెలీ! అనుమానింపకు. సఖులయెడ ననుమానించినచో ఫలంబు లేదు. ఇఁక నీవిటు మాటుపఱచినను బ్రయోజనము లేదు.

చ॥ కమలెను మోవి కన్నుఁగవఁ ♦ గారెడు నీరము పాఱుఁగంచెలన్
జెమరునఁ దోఁగె నెమ్మొగము ♦ చెక్కులనిగ్గలడంగె మేనియం
దమరె వణంకు కాఁక బలు ♦ వాయెను గంతరవంబు మాఱె మై
కమునపుడప్పురాఁదొడఁగెఁ ♦ గాంతరో! యెంతని దాఁతు వింతయున్॥

సు....సఖి! ఇదియంతయు నేఁడాకస్మికముగఁ గలిగిన జ్వరవైపరీత్యము.

మ...అది కామజ్వరమే.

మా... అలసగతివృత్తము.

వెలఁది! యిఁక సందియము ♦ వీడి కలరీతిన్
దెలుపుము బిరానఁదగు ♦ తీఱెఱిఁగి మేమీ

యలయికనుబోకడఁతు ♦ మమ్మ మమువంతఁ
గలఁపఁదగునే పరులు ♦ గాఁగనెదె మమ్మఁ.

సు...(తనలో) నిక్కములే పీరిపల్కులు. ఈ నావిధంబిఁక దాఁపవలను గాదు. ఇపుడు ప్రాణసఖులగు వీరలకు నాయవస్థ నెఱిఁగించినఁ దీని కిఁ బ్రతివిధాన మాలోచింపఁగలరు. [ప్ర] సఖులారా! ఏమిచెప్పుదును? నాఁడుగోలె నాయుపచారంబులనొందిన కైతవయతి నాహృదయచోరుఁడగునరుఁడే.

మ—(తనలో) హృదయమా! నీ యూహ చక్కనిదే [ప్ర] అయిన నీ వెట్లు తెలిసికొంటివే?

సు—ఈనాఁటిపగటనే నటకుఁజని ప్రదోషపూజకు వలసినవస్తువులనిచ్చుచుండ మధురాలాపంబులఁ గొన్నిఁబలికి యంగుళీయకాదులఁ దన నిజంబుఁదెలిపి చేరువనున్నలతాకుంజంబుఁ జూపి (సిగ్గుతో నూరకుండును)

మ...అటుమీఁదఁ దెలియునులే. అపుడు నీవెట్లు విడిచిరాఁగలిగితివి?

సు—గురుజనమును మీఱి గాంధర్వంబున కియ్యకొనుట మేరకాదని యొక నెపముఁబన్ని యరుదెంచితిని. అదిమొదలుగ నిమ్మరుండు తన బలగముతోఁగూడిసేయుగాఱియ నేనుడువలేను. (మరలఁబరుండును)

మ...(తనలో) అక్కటా తాపము దుస్సహమైయున్నది. నేనిపుడుచని రహస్యంబుగ నర్జునునిఁ దెచ్చినను గురుజనమునుమీఱి యీరాతన యగాంధర్వంబు నపేక్షింపదు. కావున నాయత్నమున లాభములేదు ఇఁక వేఱొండు ప్రయత్నము తెల్లవారినఁగదా చేయదగినది. ఇపుడించువిలుకానిఁ బూజించినఁ గొంతతాపంబు శమించునేమోకాంచెద. [ప్ర] మాలతికా! మనచెలికీబాము వాయుటకై చెఱుకువిలుకాని నారాధించుదము. నీవుపోయి యవిరళపరిమళమిళితములగు నవకుసుమకిసలయాదులఁ జిదిమి తెమ్ము? నేనందాఁకనీపొందామరాకులో నక్కందర్పాదుల లిఖించెదను.

(మాలతికని ష్క్రమించి, పుష్పాదులతోఁ బ్రవేశించును. మధు కరిక చిత్రమును వ్రాయును.)

మ...(సుభద్రనుగాంచి) సఖి! సుభద్రా! కొంచమోపిక గొని కూర్చుండి యిమ్మాన్మథునిఁబూజింపుము. శీతాపము చల్లాఱును.

సు...(సోచ్ఛ్వాసముగాఁ గూర్చుండును)

మ...శా॥ నాళీకాయతనామనః ప్రమద సం ♦ ధానాయ పద్మావళీ
ధూళీవేష్టిత గంధవాహశిశుసం ♦ దోహేష్ట సైన్యాయ తే,
నాళీకీకృతపుష్కరాయ ♦ మిథునానంద ప్రదానాయ మ
త్తాళీపుంజగుణేక్షుకార్ముకధరా ♦ యాఢ్యాయ నిత్యంనమః॥

అమ్మా! యీ పన్నీటినిఁజగురు విరులనుగొని యీ యనమశరున క ర్పించి కేల్గవఁ జోడింపుము.

క॥ మారా! మంజులతనుసుకు
మారా! లేజవ్వనంపు ♦ మారాకొమరెౘ
మారాముసేయ కౌరికు
మారా! మేరా! లతాంత ♦ మార్గణశూరా॥

(చంద్రునుద్దేశించి) చంద్రా! సత్కళాసాంద్ర! నీకు దండము పెట్టె దము. మాబాలికజోలికి రాకుము. చలువలఱేఁడను మాట బొంకు సేయకుము. (సుభద్రయందు సుముఖభావమును గాంచక విసువుతో) కటకటా! ఏమి సేయుదుము. ఓ వెడఁగు వేలుపులారా! మీకు మంచి తనము పూజించిన నెట్లు కల్గు? చెనఁటులకు సెపించుటయే తగినపని.

మా...అవును జెలీ! యట్లు చేయుదము. (చంద్రునుద్దేశించి) ఓరీ!

శా॥ వైరంబుఁగొని సత్కళంబవనుచుఁ ♦ వాంఛించి చేకొందు వె
వ్వారుఁ నాసరిలేరటంచు మినుపై ♦ పైఁబోము చక్రిర్తి నెం
తోరక్తిఁ బొనరింతు క్రూరుఁడ! గురు ♦ ద్రోహీ! కళంకీ! విశా
టా! రాజాధమ! కాలసర్పమది గీ♦ టార్చు న్నినుఁ జెచ్చెరఁ॥

మ...(మన్మథునుద్దేశించి) మీనధ్వజా! ఇంతులతోడఁ బంతములాఁడు పోటుబంటవని మేమెంతదనుక నిన్ను దోసిలొగ్గి యడుగు కొనినను జాలి దలఁపవుగా,

శా॥ ఆనాళీకభవుండు సర్వభువ ♦ నాహ్లాదంబుఁ గావింపనిన్
సూనాస్త్రున్ సుమనోరథున్ హ్యాదయశల్యత్వుంన్ జేసియున్ జాల దం
చానీయమ్ముల భిన్నకాలికములన్ ♦ స్వల్పంబులన్ గూర్చె నిం
కేనిన్ గాంచఁగ రాదె సిగ్గునిసిరో ♦ హేయక్రియాలాలసా!

బాలసమీరా! నీకింత పొగరేమిరా! నక్కను జూచినవాఁడెల్ల వేటకాఁడేనా! శుకశారికలారా! యిదియేమి పాప మిట్లు మిట్టి పడెదరు? మీకుఁగూడ నదరిపాటు చెల్లునా? మారాణి యిడిన మధురఫల భోజనము విసమై నెత్తికెక్కెనదా? తిన్న యింటివాసాల నెంచరాదు సుఁడీ. [సుభద్రవంకఁ జూచి]

తే॥ గీ॥ సకియ! జాబిల్లి ♦ సన్మార్గచారి మరుఁడు
మన మనోగామి లోఁబడు ♦ మారుతంబు
చిలుక లేకోక్తి నీతోడఁ ♦ బలుకుచుండు
విడుము! వెడవిల్తుబలగంబు ♦ వెట్టి జడుపు॥

సు... నెచ్చెలీ! దినమొక యుగముగా నిల్లొంత కాలంబుఁ గడుపుదును
మ... సుభద్రా! ఏల యిట్లు బెదరెదవు? ఇఁక నొక్కదినములో నీకుఁ బెండ్లిసేయించెద. [మాలతికతో [మాలతికా! చెలి నిటనుండి లోఁగిటిలోనికిఁ దీసికొని పొమ్ము. నే నింటికిఁ బోయెద. (సుభద్రతో) చెలీ! నే భావికార్య సంఘటనమ్మునకై యింటికిఁ బోయెద. నీ వింక లోపలికిఁ బొమ్ము!

సు... చెలీ! నా యుదంతంబు వెలిపుచ్చెదవా?
మ... నెచ్చెలీ! నీవా విచారము నాకుఁ జెప్పనక్కఱలేదులే అట్లుకాదు
మా... సఖీ! పోవుదము రమ్ము. (సుభద్రతో నిష్క్రమించును)
మ... తే॥ గీ॥ సత్యభామకు మఱదలి ♦ చంద మెఱుఁక
చేసి పెండ్లియొనర్పఁగా ♦ వాసుదేవు
వేగిరింపుమనుచు వేగ ♦ విన్నవింతు
నావలఁతిగూర్చు నీ సఖి ♦ భావికమును॥

(నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.



# సుభద్రా కల్యాణము

పంచమాంకము.



[ సత్యభామ, లక్షణయుఁ గూర్చుండి యుందురు. ]

స... చెల్లెలా ! లక్షణా !

చ॥ "మఱఁదలు ముద్దరాలు సుకు ♦ మారశరీర సుభద్రగాటమా
మరువలవంతఁజిక్కి మితి ♦ మాలిన కాఱియఁ జెందుచుండె" నం
చెఱుఁగఁగఁ జెప్పిపోయె సఖి ♦ యేమియొనర్తు "వెసన్ సుభద్ర కా
నరవరుఁబెండ్లి సేయు" మని ♦ నాథునితోఁ బతిమాలి చెప్పితిన్ ॥

ల... అక్కా! నీవట్లు బతిమాలిన నార్యపుత్రు లేమనిరి.

స... ఉ॥ "ఎల్లి యొనర్తు పెండ్లి కమ♦లేక్షణ! యెవ్విధినైనఁ జాలనా
చెల్లెలికై యిటుల్ నుడువఁ♦జెల్లునె లాఁతినె యుల్లమందిఁకన్
దల్లడమందఁబోకుమ ధ♦నంజయు నారయుమా సుభద్రకున్
దెల్లముగాఁగ నానుడినిఁ♦దెల్పుమ" యంచనె శౌరి లక్షణా!

ల—(తనలో) మంతనంబునఁ గాంతుఁ డొకనాఁడు సుభద్రచెంతనున్న యతినిఁ గాంతేయ మధ్యమునిఁగా నెఱింగించి "యీ యుదంతము నీస్వాంతమందే యుంపు"మని సెలవిచ్చె. ఈమెకుఁగూడ నట్లే తెలిపి యుండును. (ప్ర) అక్కా! వారన్నమాట నిర్వహింతురు,

స... నీవుగూడ నట్లే యంటివా !

ఆ॥ వె॥ అన్నగారు కన్నె ♦ నా సుయోధనునకు
నీయఁ బ్రతినసేయ ♦ నిమ్మహాత్ముఁ
డేమిసేయఁబూన ♦ కే యిట్లు పేక్షించె
నింతపుట్టె దాన ♦ నింతి! కంటె॥

ల...(తనలో) అన్నమాట యనగా నన్నగారిమాటయని యర్థము చేసుకొన్నది. (ప్ర) అక్కా! ఆమాట నిక్కమే కాని ప్రియుఁడు తానన్న మాట చెల్లించునని యంటిని.

స...ఆమాట మఱవు రాకున్నయెడల (జ్ఞాపకమునటించి) మఱచితి. చెల్లెలా ఆర్యపుత్రుఁడు సెలవిచ్చిన విధమున సుభద్రను వినోదింపఁ జేయుటకై యామె మందిరంబునకుఁబోదముపద, విజయుని భుజింపఁ జేయుటకై మన యక్క రుక్మిణి చనెనఁట.

ల...ప్రబలవిరహావ్యాకులయగు మఱఁదలి నూరడించి వినోదంబుల నామెకుఁ గాలయాపనము చేయుట మనకు నిక్కలి యావశ్యకమే. పోవుదముపద. [పరిక్రమించుదురు.]

క॥ సొమ్ములను వీడి పుష్పని
భమ్మగు మెయినలరు సెజ్జ ♦ పయిఁ జేర్చి విచా
రమ్మునఁ జెక్కిటఁ జేయిడి
యమ్మెయిఁ బవళించియుండె ♦ నరయ మఱదలిగ॥

(యథానిర్దిష్టముగా సుభద్ర ప్రవేశించి యుండును)

స...సుభద్రా! నేఁడేమి యిట్లార్తిఁ జెంది యున్నావు?

చ॥ చెలియరో! నీదు మేనఁ దగు ♦ చెన్నులుమాసె విలాసహాసముల్
చెలువఁపు మోముఁ బాసె నిటు ♦ చిత్తజువంతఁ గృశింపఁబాడియే
చెలులు హసింపరే? వగలఁ ♦ జెందరె? నీగుణులమ్మ చెల్ల నీ
తలఁపులు దీఱుఁ దేఱుమల ♦ దైవమె నీయెడ నున్నవాఁడొగిన్॥

సు...శరీరము కొంచెమస్వస్థముగా నున్నదమ్మా! (లక్షణను జూచి) చిన్నవదినకూడ వచ్చినదే.

ల...[మందహాసముతో] ఔరా! మాటకారి. (సుభద్రతో) నేఁడు మీ స్వామి నేమి చేసితివమ్మా?

సు...(తనలో) నే నందజేంతకము న్నెఱిఁగి యుండుటచేఁ బలుమఱు నన్నిట్లు పరియాచక మాడుచున్నారు. నేనే బేలతనంబున నింతదను కఁ దెలియకుంటిని. (ప్రకాశముగా) మాస్వామి యేమమ్మా! స్వామ లందఱికిఁ బూజ్యులుకారా?

ల...నిక్కమే. ఎవరిస్వాములు వారికిఁ బూజ్యులు నీస్వామి కావున నీకుఁ బూజ్యుఁడు మాకో మన్నింపఁ దగినవాఁడు.

సు...వదినా! అట్లయిన వారు నాకు స్వాము లెట్లగుదురమ్మా!

స...[చిఱునవ్వుతో] నిరతము నీ సేవలఁగాంచి యానందించు వారు నీ సాములుకారా? వారికెట్లు పచరించితివో వారు నిన్ను వదలరఁట. నీవు సహచారిణివై వారికడ నుండవలయునఁట.

సు...(తనలో) చతురయు, జాణయునగు నీమెను నేను మెప్పింపఁగలనా? [ప్రకాశముగా] వదలకుండుటకు నేను వారికి సాధ్యమగుట యెట్లు?

స...వారి దగ్గఱకుఁ బోయినపుడు నీ పాణిగ్రహణంబుఁ జేయుదురు.

సు...(లేనికోపముతో) పెద్దవారెట్లన్నను జెల్లును. వదినగారిని కెప్పుడు ను వేళాకోళములే.

స...సుభద్రా! నీమనోగతము నాకుఁగూడ దాఁచెదవా!

సు...ఏమిదాఁచితినమ్మా మీ సొమ్మ?

స...నా సొమ్ము నాయొద్దనే యున్నది. నీ సొమ్మ మాత్రమంతయుఁ దీసి నీ సామికిచ్చివేసి నట్లున్నావు.

సు...మీమాటలెల్ల బూటకములు నేనిచ్చితినన్నను యతులకు సొమ్మే టికమ్మా!

స...యతియో యతిపతియో నాకుఁదెలియదు. నీ నగలన్ని యిపు డే మిచేసితివి? నామాటలు బూటకములైన వారికడకుఁ బోవుదమురా!

ల...(చిఱునవ్వుతో) నిక్కము సుభద్రా! ఆయతిరాజుచేతి విభూతిఁ

దాల్చితివేని నీ యీ యతను తాపంబడఁగు, కల్యాణంబగును పోవు
దము రా!

సు...నేను రాను,

ల....హేతు వేమి?

సు...ఏమియు లేదు.

ల...ఏమోయున్నది రహస్యము. రాకున్న నీగోప్యము తెల్లడియగును
సుమీ!

సు...చిన్నవదిన యీగడమునకు బొత్తిగా వేళపాళలుగూడ నుండవమ్మా

స—(లక్షణను సైగతో వారించును).

చ॥ అగ డొనరింపఁ బాడియగు ♦ నా? తగునా? మరుతూపులన్ గడున్
వగఁగొనియున్న దీమగువ ♦ వాదము మానుము లక్షణా! లలిన్
దగునలయాటపాటలను దద్దయుఁ బ్రొద్దులు పుచ్చఁజెల్లు ని
మ్ముగ మనజీవితేశ్వరుఁడు ముద్దియ పెండిలిసేయునంతకున్॥

(సుభద్రతో)

మ॥ విరిబంతుల్ గనుమీవె యాడుదము నీ ♦ వే గెల్తువో! మేము నే
ర్పరి వీవచ్యుతసోదరీ! సుకవితన్ ♦ వ్రాయింపుమీ! యింపుమై
శరమాసించితి నేడు నిన్ను జదరం ♦ గంబందుఁ గెల్వంగఁ జా
తురిఁ జూపింపుము లెమ్ము రమ్ము! పుడమిన్ ♦ దోఁగాడ బాగే
యిఁటుల్॥

సు—అష్టావధానముఁ జేయుమనెదవా యేమి?

స—అవును.

తే॥ గీ॥ చెలువ! యష్టావధానంబుఁ ♦ జేయఁజాలి
నట్టిదానవటంచు మా ♦ యందఱకును
నిన్నుఁగూర్చి వచింత్రు నీ ♦ యన్నగారు
సేయుమీయిపుడద్దానిఁ ♦ జిత్రగతిని,

సు—మీకసరదాకలిగిన నాకుఁగలుగవలదా?

స — నీకేల సరదాలేదు? నీకుఁగలచింత నేఁడీర్చెదనంటిఁగదా.

(తెరలో)

క॥ అంతర్ద్వీపంబందున
సంతతమంగళులకద్రి ♦ జాశివులకుఁగం
సాంతకుఁడు పరిణయోత్సవ
మెంతోవిభవముగ సల్పు ♦ నల్లిత్రియామన్

సు,స,లలు — (విని) ప్రియము ప్రియము.

(తెరలో)

క॥ కావునఁ బౌరులు తమతమ
శ్రీవిభవము మెఱయ నటకు ♦ సేవింపంగాఁ
బోవలయు వేగనిదివను
దేవకుమారాజ్ఞయనుచుఁ ♦ దెలియఁగవలయున్॥

స...సుభద్రా! పురాణదంపతులగు శివులకల్యాణవార్త మనకు మిక్కిలి
శుభసూచకము, సుముఖము.

(సుముఖుఁడు పటాక్షేపముగాఁ బ్రవేశించి)

అమ్మగారూ! శ్రీకృష్ణప్రభువుగారు తమకొకసందేశమంపియున్నారు.

స — ఏమి చెప్పుము!

సు — "అంతర్ద్వీపంబున నుత్సవంబునకు బలరామప్రభువుగారు రేవతీ
దేవిగారితోఁ జనిరనియును తేపు సుభద్రాదేవి నర్జునప్రభువుగారి
కిచ్చి పెండ్లిచేసి యింద్రప్రస్థమున కని పెదరనియును నందులకుగా
నిపుడామె నలంకరించి పెండ్లికొమరితను జేయుఁడనియును" జెప్పిరి.

స — ప్రియము ప్రియము. సుముఖుఁడా! మేమల్లేకావించెదము. నీవిఁకఁ
బొమ్ము. సుభద్రా! మనమిఁక లోపలికిఁబోదమురమ్ము.

[ అందఱు నిష్క్రమింతురు ]

ఇది పంచమాంకము.





# సుభద్రా కల్యాణము

## షష్ఠాంకము.

—×—

(అడవిలోఁ జెట్టుక్రింద సుభద్రార్జునులుందురు.)

అ—[ఆనందముతో]

తే॥ గీ॥ శిరము బాహువునందిడి ♦ కరము గళము
నందునిడి మదిఁ గూరిమి ♦ నంది తెరువు
పయనపుం బడలిక దీఱఁ ♦ బవ్వళించె
నాదుకలుముల ప్రోవు పు ♦ ణ్యముల తావు॥

పగలంతయుఁ దేరుపయనంబునను సారథ్యంబునను బడలిన నీపర్వేందుముఖి వేఁడి నిట్టూర్పులు నిగుడింపుచు నెంతలో నిదురించినది. మొదలరథంబుఁ దోలుకొనుచు జోదులఁ గవిసి యుద్ధంబు సేయునన్గాంచి 'సమర సారథ్యంబులలో నొక్కపని తనకొసఁగు' మనికోరి సారథ్యంబు ననుమతిఁబడసె. అప్రతిములగు శూరశిఖామణుల చెలియలగుటకదా! యీసంగ్రామధీరత యీయబలకబ్బినది. ఓకృపానుభావ! వాసుదేవ! నీయవ్యాజకరుణఁ గదా. నేనీవీరనారిఁ గైకొని పుట్టువునకు భాగ్యంబుఁ గూర్చితిని. [సుభద్రాముఖమును జూచి]

ఉ॥ ఈమధురాస్య యర్జునజ ♦ నీందిర కన్గవకిందుమూర్తి యీ
కోమలిమేనితాకు మెయి ♦ కో హరిచందనసారసేకమో

కేమభుజంబుగంతమున ♦ లీల నెసంగెడు రత్నహారమీ
రామశిరంబు బాహువున ♦ రాజిలు జాతిలతాంతగుచ్ఛమై॥

ఏమిది నిదురమానియుండుట నీరాత్రి పెరుఁగున్నట్లు తోఁచుచున్నది. (తూర్పువంకఁజూచి) అల్లదిగో శుక్రోదయంబగుచున్నది.

ఉ॥ ఆరయనన్యలోకగతుఁ ♦ డైన విభావసుఁడాత్మదేశమున్
జేరుచునైజరాష్ట్రమునుఁ ♦ జేకొని రాచఱికంబు సల్పుదో
షారతుఁజక్రదుఃఖకరుఁ ♦ జందురునొంపఁగఁ బంపినట్టి స
ర్దారుఁడనంగ భార్గవుఁడు ♦ ప్రాచిఁదగెన్ శశిజాఱెఁ జయ్యనన్॥

ఆహా శకుంతనికరకలకలంబుగర్ణరసాయనంబగుచున్నది.

తే॥ గీ॥ పూర్వదిక్స్త్రీమనోంది ప్ర ♦ భుతఁదనర్చు
సత్కళానిధి ద్విజపతి ♦ సమయగతిని
వారుణీసంగమంబునఁ ♦ బతితుఁడయ్యె
ననుచు నాక్రందనమొనర్చె ♦ నాద్విజతతి॥

(సుభద్రమేల్కనఁగాఁగాంచి)

క॥ వెలవెలఁబాఱెన్ గుముదిని
మెలమెల్లనె నళిని ప్రజ్ఞ ♦ మీఱెన్ జగముల్
తెలివిన్ దేఱెన్ దూర్పునఁ
దెలవాఱెన్ మానినులకు ♦ ధీరతదీఱెన్॥

సు—ఆర్యపుత్రు లిట్లు వేగించియుండఁగా గాఢముగా నిదురించిన యీ సుభద్ర లజ్జింపుచున్నది.

అ—ఉ॥ దేవి! యిటుల్ దలంపకుము ♦ దీర్ఘగజారితరక్షుగండకా
రావపరీతమీవనము ♦ రాత్రి తమోఘన శ్రాంతనీవు ని
ద్రావశవైపరుండితివి ♦ రక్షణకైకద కాచియుండితిన్
సేవకులప్రమత్తులయి ♦ సేవలఁగొల్వరె యాత్మదేవులన్

సు—ప్రేమగలతావున నపచారంబును బ్రియమగుఁగదా.

అ—దేవీ! ఈ నీ ప్రియాలాపంబు లమృతపేయంబులు,

క॥ పేయంబులమృతబిందు
ప్రాయంబులు వరపరార్థ ♦ బలవన్మాల్యా
నేయంబులు తాపార్త క
షాయంబులు దేవి! నీల ♦ సద్వచనంబుల్॥

(ఉదయించినసూర్యునిగాంచి)

క॥ ఇనునిఁ గాంచి తగఁ బ
ద్మినివ్యాకోచంబునొంది ♦ దృష్టిందనిపెఁ
పెనిమిటితోడుత వేడుకఁ
గొనియుంటయె కరముప్రియము ♦ కోమలకు నెందుఁ॥

భగవతే! భాస్కరాయనమః. [సూర్యునకు నమస్కరించి సుభద్రతో] దేవీ! సకలలోకవిబోధకారణుఁడగు నీ యుదయభానునకు వందనం బిడుము.

సు—వందనము కర్మసాక్షికి.

అ—దేవీ! ఇఁకఁ దే రెక్కుము. పోవుదము.

సు—(అర్జునునితోడ రథంబెక్కి రథవేగమునుగాంచి)

చ॥ అరదము పోవఁగా గుఱుతు ♦ నందఁగరాదు పథంబునందు ద
గ్గఱఁగనరాక వస్తుతతి ♦ గన్పడినంతనె దూరవర్తియౌ
హరులుగతి ప్రభేదముల ♦ నారసి పోవు హుటాహుటిఁ మనో
హరుఁడితఁడింక నశ్వహృద ♦ యాత్మికవిద్య నెఱుంగుటబ్రమే॥

అ—గుఱ్ఱముల పగ్గములను బిగించి సుభద్రతో) చెలీ! ఇపు డింద్రప్రస్థ రాష్ట్రమును జేరితిమి. అల్లదిగో దూరముగాఁ గన్పట్టు వనంబులో మజ్జనాదికంబులఁ గడిపి సాయమునకు సుఖమ్ముగ నిలుచేరుదము.

సు—ఆతోఁట యిదియే కాఁబోలు చూడుఁడు.

అ—(రథమాపి) అవు నిదియే కాంతా! చూచితివా ?

సీ॥ మధురసఫలాహార ♦ మానితవరకీర, ఘనరామనామ పా ♦ వనము వనము
నానాసుమసుగంధ ♦ నవరసభోజన. పరచంచరీకజీ ♦ వనము వనము
సముపాత్తమాధవీ ♦ జాతీరసామోద, వర్ధితబాలప ♦ వనము వనము
కలహంసదంపతీ ♦ కలరవముఖరిత, పద్మాకాసారభు ♦ వనము వనము

తే॥ గీ॥ మార్గసంపాతశోషిత ♦ మనుజతాప
వారణక్షమవల్లిభ ♦ వనము వనము
చారుకరిణీసముచ్చయ ♦ సహితమహిత
ఘనమదసుగంధకరిమశ్వ్య ♦ వనము వనము॥

సు—సిక్కమే వనవాటిక పుష్పాడులఁ గుప్పెడు వాతపోతములచే సొల పఁడుచున్నది.

అ—జీవితేశ్వరీ! కలహంసారవవ్యాజంబున నా సరసి మనల నాహ్వానము సేయుచున్నది. డాయఁ బోవుదమా ?

[తెరలో]

అరే దురాత్మా! భారతయశో విహీనా! అర్జునా!

ఉ॥ పోకుమురోరి! నీ బిరుదు ♦ పొంకమణంచెద నేడు కుంతికిన్
శోకముఁగూర్తు పాండవుల ♦ శోభలనేలఁ దొలంగఁ ద్రోతు నీ
వాకనకోదరుంగడియ ♦ నంతక శత్రువుడాయఁ బోయినన్
వీఁకనుబట్టిచంపెదను ♦ వేగిరమేల వ్రియాణమందిఁకన్॥

సు—[భయముతో చెవులు మూసికొని] పాపము శాంతముగుఁగాక! ఆర్యపుత్రా! వింటివా! యీ యశ్లీలవచనంబులను ఇప్పరుషవచనుండు భటవృత్తం బెఱింగి మనపై కడరి వచ్చెఁడు బలభద్రుండు కాఁడుగదా ?

అ—(అలక్ష్యభావముతో)

చ॥ తలఁకఁగనేల బాల! కొను ♦ ధైర్యము నెవ్వఁడు వచ్చెనేని నా
విలుచవిఁగాంచి పాఱు భట ♦ వృత్తమెఱింగి బలుండువచ్చినన్
బలుమఱు సాయకంబుల ను ♦ పాయనమిచ్చెద మెచ్చునట్లు నా
యలవుఁ జలంబుఁగాంచెదుక ♦ దా యిఁక నేలవచింపఁ బెంపుగా॥

మన మంతదనుకఁ బిలుచుచున్న నాసరసిన్ జేరుదము రమ్ము.

(తెరలో)

క॥ సరసి నినుఁజేరఁ బిలుచున
దురితగతీ! పాపజాతి! ♦ దుర్మదమతి! కం
ధరమున్ జేరఁగ నీహాల
సరమిపుడే పిలుచు నిదియె ♦ శమనేరితమై

బ...[కోపావేశముతోఁ బ్రవేశించి 'పోకుమురోరి' యను పద్యమును బిగ్గఱగామరలఁ జదివి] ఓరీ! స్వామిద్రోహపరాయణ! యర్జునా! ఎందు దాఁగఁ బోయెదవు! నిలుము నిలుము.

ఉ॥ దాఁగినఁదప్పదెందయిన ♦ దాఁకొని వీఁకను పీడి గోతులన్
లోఁగినఁదప్ప దాహవము ♦ నన్ గొనఁదప్పదుచావు నేఁడు నీ
కీగతిగా లిఖించె పర ♦ మేష్ఠి హలంబిదె డాసెఁ గన్నిఁకన్
సాగునె హీనయత్నములు ♦ సల్పిన యల్పుఁడ! నాదు చెంగటన్॥

సు...హో యగ్రజుఁడే వచ్చుచున్నాఁడు.

అ...(బింకముతో) దేవీ! నీకీ యడలేల?

మ॥ బలరామున్ గిలరాము యాదవుల శుం ♦ భద్విక్రమోపేతులన్
గలలోనైనను లెక్కసేయ నిది ని ♦ క్కంబేపునన్ వారలన్
గెలువంజాలుదు జంపుగొంకుఁగొన కొ ♦ క్కింతేనిస్వాంతమ్ములోఁ
దెలియంగాఁగలవీవె! మాటికిటు నేఁ ♦ దెల్పంగ నింకేటికిన్॥

ఇఁక నేనీవిల్లెక్కుపెట్టి యాతని నెదిరి కొనియెద.

సు...(పరితాపమును సూచింపుచు వినయముతో)

వనమయూరవృత్తము.

నామనవిఁ జేకొనుము ♦ నాహృదయధామా!
తామసముమీఱు బలు ♦ దర్పమునఁ దాఁకన్
నామతముకాదు బుధ ♦ నంద్యవినయోక్తిన్
సామమునుగూరిచి ప్ర ♦ శస్తము చనంగన్॥

మఱియు నీ విక్రమం బెఱుంగకయును నన్నులయందుఁగల ప్రేమ వశంబునను నిట్లాడితినని తలఁచెదవేమో ? అటులకాదు. సహానము గల శూరున కెప్పు డవమానము కలుగదు.

చ॥ వితతయశోనిధాన! నయ ♦ విజ్ఞులు డెల్పుదురాత్మవృద్ధికిన్
వితరణి భూరికర్మఫల ♦ వృష్టిపయోదము ఘోరవైరిసం
హృతికనపాయశస్త్రిక స ♦ మిద్ధపరాక్రమభూషణంబు హృ
ద్గతఘనతాపభంజకను ♦ధారసమా క్షమయంచు నెంచుమా!

అ...(మెచ్చుతో) వివేకిసీమణీ! ఈనీ నీతివచనంబులు విద్వన్మోదకంబులై యుండ నేనేల వానిఁ జేకొనకుండుదును? ఇఁకను నీవిట్లుపదేశింప కున్న మాత్రము నీ యన్న పగిది యుక్తంబరయక కయ్యంబున కేగెద ననుకొంటివా ? శాంతవచనంబులఁ గినుక నాఱ్పఁజూచెద. ప్ర సన్నుఁడు గాకున్నఁ జినరకుఁ జాపమ్మున విమణ్ణునిఁ జేసెద.

సు...గురుజన భక్తియును నీతియును జలింపకుండుఁగాక!

బ...ఓరీ! యెక్కడ

అ...[బలరాముని సమీపించి] బావా! బలదేవ! నమస్కరించెద. నా ప్రార్థన వినుము.

మ॥ అలుకన్ బోవిడుమయ్య! యోర్పుఁగొనుమ♦య్యా!ఇట్టికయ్యంబు లీ
వలనన్‌జూవఁగఁజెల్లునయ్య! పరులన్ ♦ బాటించి చెండాడఁ బో

వలెనయ్యా! ననుభర్తగాఁగొనిన లా ♦ వణ్యాబ్ధి నీచెల్లెలిన్
దలఁపుండక్కి సరించినాఁడ కనరా ♦ దా! పూర్వబాంధవ్యమున్

బ...(గర్వముతో)

మహాస్రగ్ధరావృత్తము.

ఛీదుష్టా! క్రూరచేష్టా! ♦ చిరతరహితగో ♦ ష్ఠీ పరిత్యాగనిష్ఠా!
భేదచారప్రవిష్టా! ♦ పృథుదురితచర ♦ ద్భీరుచిత్తానువేష్టా!
నీదీనారాళవాక్యాల్ ♦ నిరతముమము బం ♦ ధించు నేరజ్జుభంగిన్
వాదంబేలాయిఁకన్ నీ ♦ వధయెవిధిసుమీ ♦ వాఁడిదప్పించుకొమ్మీ!

ఓరీ! జల్పాక! దుర్మదాంధీభూతభారతకుల కలంక! నే నూరలేని యపుడు నాచెల్లెలిన్ దొంగలిగొని పాఱివచ్చితివి కాని నేఁటిగతి నారయవైతివి.

శా॥ గర్వోద్రేకఘనప్రతాపచణదో ♦ ర్గాంభీర్యవీర్యస్ఫుటా
ఖర్వారాతిపరాక్రమాక్రమణ జా♦గ్రత్కార్ముకస్ఫూర్తిఁయున్
దుర్వారస్వరుభూరిఘాతవితతా ♦ స్తోకప్రథాసంచల
త్సర్వోర్వీతల సీరలోహముఖముల్ ♦ శాసించిభాసించుతన్

అ—(కోపమును నగవుగామార్చుకొని) బావా! మాటికి నీవు బవరంబు నకుఁ బిలుచుచున్నను నామనం బందులకు సాహసింపకున్నది.

చ॥ బలుఁడనిపేరె ఘోరపరి ♦ పంథివిదారణసాధనంబు లాం
గలము సిడెంబు తాళము ని ♦ కామరణప్రథితప్రభావుల
య్యలఘులు యాదవుల్ ముసలి ♦ వక్కట నన్నుఁదాఁకనోర్తునే
కొలఁదియెఱుంగకిట్లు తల ♦ కుం దగనట్టి తలంపులొప్పునే?

ఆ॥ వె॥ బావగారు! వినుఁడు ♦ పరువుపోయెడువ్యవ
హారమునకుదిగఁగ ♦ మేరగాదు
భావ్యమెంచికొనుఁడు ♦ "బాలాదపి సుభాషి
తం"బటనఁగ వినరె ♦ ధాత్రిలోన॥

బ...(తనలో ఏమి వీని వచనవాక్చాతుర్యము! కోపముతో) ఓరీ! "గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు" నీవు నన్నధిక్షేపించుటయును, "తాతకు దగ్గునేర్పినట్లు" నీవు నాకు బుద్ధులుజెప్పుటయునా. ఇంతకును "చెట్టుచెడునాఁటికి కుక్కమూతిపిందె"లన్నట్లు చంద్రవంశమును నలువుఁగావింపఁ బుట్టిన నిన్ననవలసిన దేమున్నది.

సీ॥ అలప్రలంబాసురు ♦ హతముచేసిననాఁడు
బలుకౌశలంబౌశ ♦ లలమ లేదో
దిట్టయౌముష్టికుఁ ♦ బట్టిగిట్టిననాఁడు
ముసలితనంబుసాం ♦ పెసగ లేదో
కాళిందికానదీ ♦ గర్వమార్చిననాఁడు,
లాంగలస్ఫూర్తిచె ♦ లంగ లేదో
ద్వివిదవానరునిఁ బ్రది ♦ దివముఁజేర్చిననాఁడు
తాళధ్వజముకీర్తి ♦ దనర లేదో

తే॥ గీ॥ ఔర నీవెంతవాఁడవో ♦ వీరమూర్తి
విట్టులవతారమొంది గ ♦ న్పట్టినాఁడ
వెపుడుగన నిట్టివాక్యాయు ♦ నిభ్యదూఱు
రమ్ము సర్వంబరయ సంగ ♦ రమ్మునకును ॥

అ...(ఎకసక్కెముగా నవ్వి) బావా! నీవు చెప్పిన యీ నీవిజయములే నీశౌర్యమును వేనోళ్ళ శ్లాఘింపుచున్నవి.

ఉ॥ కోఁతినిఁజంపుటారసినఁ ♦ గొంచెముకాదు ధరిత్రిఁబాఱున
న్నాతినినేచుటెంతయు ఘ ♦ నంబు, ధరావిభునాజ్ఞనెట్టిటో
చేతముదిట్టసేసి యని ♦ సేయఁగవచ్చిన బంటుఁగూల్చులే
ఖ్యాతికిసాక్షి కౌన నస ♦ హాయుఁ బ్రలంబు వధించుటెక్కుడే॥

బ...(పట్టరాని కోపముతో) ఓరీ! దొంగా! పాఱుఁబోతా! ఏలయిట్లు ప్రేంగిపడెదవురా?

ఉ॥ కుందెను దక్షశాపమున ♦ గోత్రకరుం డుడురాజు నాఁడు ము
ప్పొందెను శుక్రకోపమున ♦ నుగ్రజరామయుఁడై యయాతి తా
గ్రమందె మునీడ్విలాపమున ♦ మత్తుఁడు నీజనకుండు నేఁడటుల్
డిందెదు నాదుచాపమున ♦ లేకి! వివేకివిధం బెఱుంగుదే ॥

అ....(కోపావేశముతో) ఓయీ! హాలారసప్రేరితా రాళవచనవాదీ! గురుజననిందావాదీ!

మ॥ గురుపంచాలమునందు నిన్ జెనకఁ జే ♦ కూరున్ భవంబంచు నేఁ
గరముల్ శాంతము నొంది వేఁడిన నిటుల్ ♦ గర్వోక్తులన్ బాడెదే?
బిరుదమ్ముల్ గనుగొందురమ్మఁ కను నీ ♦ బీరంబులన్ దాఁచి వే
గిరమే నిన్ననిఁ గెల్చి యొంచెద ధనుః ♦ కీర్తుల్ దిశల్ నిండఁగన్॥

ఓయీ! దొంగయనియుఁ బాఱుఁబోతనియుఁ బలుమాఱుగ్గడింపుచున్నావు. వలచి వావికిఁదగిన కన్నియను జేకొనుట దొంగతనమా?

క॥ రథినై యుక్తవధూసా
రథినై నీద్వారకాపు ♦ రమునుండి మహా
రథులదర నేగుదెంచితిఁ
బ్రిధమున గెలిచి వృథు క్రి ♦ వస్త్వాదిములన్ ॥

ఆ॥ వె॥ దొంగదొంగయనుచు ♦ దోర్విక్రమముఁ దక్కి
చేతఁ జిక్కి శరణుఁ ♦ జెందినీదు
భటులు పోయిరిప్పు ♦ డటులె యీయాజిలో
లొంగునెవఁడతండె ♦ దొంగనిజము॥

ఇంకను పాఱుబోతు తనమును గుఱించి

క॥ పాఱితినంటివి నన్నునిఁ
బాఱఁడు మా వంగడమునఁ ♦ బసిబాలకుఁడున్
సీరి! జరాసంధాజిని
బాఱి పురముఁ గడలినడుమఁ ♦ బన్నుటమఱపో॥

చిఱుతనాఁటనుండియుఁ బరస్పరానురక్తులమగు మమ్ము వేఱుచేసి

సౌందర్యఖనియగు నీ చెల్లెలిఁ దుర్యోధనునిపాలుఁగావింపఁ గడంగిన నీప్రయత్నమ్ము వమ్ముఁగావించినను నహంకారంబును విడకున్నావు. ఇఁక నాబాణంబుల చవి యొక్కమాఱు చూచెదవేని నక్కజంపడి యీకక్కసు మానుదువు.

బ—ఓరీ! కంటికెప్పవలె నిజభుజాబలంబునఁ గంసరాష్ట్రంబునెల్లఁ గాపాడుచున్న ముష్టికాసురు నొక సైనిమాత్రునిగాఁ దెగడి వానిఁబరిమార్చుట యొకపాటిగాదని నన్ను వెక్కిరించిన నీవేమరలఁ బదాతి జయంబుగ్గడించుచున్నావా ?

ఉ॥ లెంకలగెల్చి మాటికిఁ బ ♦ టీయని జంకుకళంకులేక యు
ట్టంకముఁజేసెదే మొఱకుఁ ♦ డా! పరువా! తెరువా! యిఁకన్ నిరా
తంకుఁడవై కడంగుమనిఁ ♦ దార్కొని మార్కొని ముట్టి గిట్టి నీ
పంకమణంతు భూప్రజలు ♦ బాపురె వాహ్వరెయంచు మెచ్చఁగన్

కావున రమ్మిమ్మసమరప్రదేశంబున సమరంబుఁజేయుదము.

అ...ఇదిగో వచ్చుచున్నాఁడను. [బలాఢ్యులు విక్రమింతురు]

సు...(తనలో) హా కష్టము కష్టము.

చ॥ తలపడె నాథుఁడాజికి ను ♦ దాత్తగతిన్ గినుకన్ జలింపకీ
యలఘుఁడు కామపాలుఁడెద ♦ నాదరముంచక పెంచెనల్క నే
నులుకక పోయివేఁడినను ♦ నుద్ధతి నాతలఁద్రుంచుఁగాని చె
ల్లెలఁగనఁడాజిమానఁడు బ ♦ లుండతికర్కశుఁడేమిసేయుదున్

కానిమ్ముపేక్షింతమన్నచో

ఉ॥ ఇద్దఱు యుద్ధరంగఘను ♦ లిద్దఱు బాహుబలంబుగల్గువా
రిద్దఱు దివ్యచాపధరు ♦ లిద్దఱువెన్కకుఁద్రొక్కనట్టివా
రిద్దఱు నాకుఁబ్రాణసము ♦ లిద్దఱిసేమముగాంక్షితంబ! యీ
యుద్ధటిలో నొకండయిన ♦ నింకిన నాకిఁక జీవముండునే॥

(తెరవంకఁజూచి) ఆ, బలార్జునులు ద్వంద్వయుద్ధంబునకుఁ దొడంగిరి

ఉ॥ పూనిక సింహనాదములఁ ♦ బూని బలార్జును లొండొరుల్ బృహ
ద్భానుశిఖల్ దృగాళిఁగను ♦ పట్ట భయానకులై విదర్చిరే
నేను బడింబడిన్ బదియు ♦ నేను పడేనుల నారసంబులన్
మేనులు చిందు నెత్తురుల ♦ మేకొని మోదుగుపూలఁబోలెడున్॥

హా ఘోరుభరంబయ్యె.

తే॥ గీ॥ అకట వదలిరి దుర్దారు ♦ ణాశుగముల
నూఱు నిన్నూఱు మున్నూఱు ♦ నూఱునూఱు
లను నవియు నగ్గిమంటలఁ ♦ దనరుచున్న
విపుడుకనరావు కనులికఁ ♦ నేమిదిక్కు॥

[ పరికించి ]

ఉ॥ అగ్రజుఁడేయుబాణముల ♦ నార్యుఁడుద్రుంపఁగ నార్యకేలితో
దగ్రశరంబులన్ బెలుచ ♦ నగ్రజుగుంబొడిసేయఁగాఁ బ్రిభూ
తాగ్రహమూర్తులై యవని♦నంతయుఁగాండమయంబుఁజేయఁగా
నుగ్రతఁబూని రీరణమ ♦ హెూద్ధతి నాఁగెఁడు వాఁడు గల్గునే॥

(తెరలో)

ఉ॥ దొంగతనంపు వేసమునఁ ♦ దుందుడుకొప్పఁగ నాదుచెల్లెలిన్
దొంగిలిపాఱుచున్న నెఱ ♦ తుంటరిఁ బెద్దలయందు బంధులం
దుంగపటంబుఁ గూరిచిన ♦ దుర్జను నర్జును జీవితంబులన్
భంగమునొందఁజేయుమ సె ♦బాసని మెచ్చెదఁబావకాస్త్రమా॥

సు...అమంగళము శాంతమగుఁ గాక, నాథుఁడేమో యనుచున్నాఁడు
వినియెద.

(తెరలో)

తే॥ గీ॥ అచ్యుతాగ్రజునకు నాకు ♦ నఖిలభువన
వలయమున కార్తి రాకుండ ♦ వలయుఁగాఁతె....

పావకాస్త్రమ! బలరామ♦పావకాస్త్ర
శాంతిఁగూర్పుమ! నా నుతి♦శతముఁ గొనుమ!

సు...ఆర్యపుత్రుని యాగ్నేయాస్త్రంబున నా యస్త్రంబు శాంతిఁబొందె ఇఁక నగ్రజుఁ డేమిసేయునో.

(తెరలో)

మ॥ విజయుం డుర్జయు నంతకాతిథినిఁ గా♦ వింతుం గనుండంశుమ
ద్రజనీపాలకులార! కాననచర♦బ్రహ్మర్షులారా! సుధీ
ద్విజమార్గప్రతిగామి! దండమున సం♦భావింపు మీక్షణ్ణు బే
రజములాయఁగలాంగలాహతి యిదే♦రక్తంబుఁ గ్రక్కించెదన్

సు...హృదయమా! ఇంకను ధైర్యమవలంబించెదవా? ఇఁక దరవాయి యేమున్నది.

(తెరలో)

అ...ఓయీ! నీపూన్కి యంతయు నీ బ్రహ్మాస్త్రంబునఁదీర్చెద.

సు...దైవమా! యిప్పుడేమి సేయుదును, విఫలితాస్త్రుండగు బలుండు పిడుగులఁబోలు నార్యపుత్రుని బాణంబుల నొచ్చి రిచ్చపడి పేరలుకఁ గోదండంబు నరదంబునఁ దిగవిడచి హల, ముసల, గదా, ఖడ్గంబులఁ, గరచతుష్టయంబునఁ బూని కాలయమునివగిది "విజయుం జంపెద" ననుచు నార్యపుత్రునిపై కుఱుకుచున్నాఁడు. ఆర్యపుత్రుండును దనపై కుఱుకుచు వచ్చుచున్న బలరామునిఁ గఱకుటమ్ములఁ జేరనీయక యే బ్రహ్మాస్త్రమునకై ధ్యానముసేయుచున్నాఁడు. [విచారముతో దైవమునుగూర్చి.]

పంచచామరవృత్తము॥

హలంబుదాఁకి యార్యపుత్రుఁ♦డంతరించునేమొ యీ
ప్రలంబవైరి తావకాస్త్రి♦పాతుఁడౌనొకో విధీ!

తలంపరాని యిట్టిచెట్ట • దారుణక్రియల్ నినుఁ
గలంపవే! కనఁబిరానఁ • గాంచవే! ప్రతిక్రియన్॥

హా యార్తత్రాణపరాయణ! నారాయణ! నీవేదిక్కు.

దండకము॥ శ్రీ చిత్త రాజీవమిత్రా! ఘనానీలగాత్రా! సరోజాత నేత్రా! కృపాశీలవక్త్రా! సులీలావిచిత్రా! సురారాతిజైత్రా! మహాసచ్చరిత్రా! పవిత్రా! గుణాధార! నీ రేజజన్మాదిబృందారకాత్మాంబుజాళీవిహారా! యకూపారమగ్నశ్రుతిగ్రామసంగ్రాహ! మంథానశైలోరుభారోద్వహా! భూప్రతిష్ఠావహా! దైత్యపుత్రార్తిహారీ! త్రిపాదానుసారీ! ధరాపాలమారీ! దశాస్యాంతకారీ! హలాంచత్సుపాణీ! లసద్బుద్ధవాణీ! సుధీగమ్య శ్రీకల్కిదేవా! మముఁ గావరావా! విపన్నాత్మతన్ గోరితిన్ నీవ దైవంబవంచున్ శరణ్యంబవంచున్ సురేశా! ధరేశా! పరేశా! మహేశా! నమస్తే నమస్తేనమః॥

(తెరలో)

చ॥ ఉడుగుము పాండునందనుఁడ! • యుద్ధతిఁబోవిడుమగ్రజా! యిటుల్
దొడరుటయుక్తమా?నరుఁడు•దూష్యుఁడె? చూడుము! మేనయత్తకున్
గొడుకు పటుప్రతాపనిధి • కూర్మిలనుంచిన నీదు చెల్లెలిన్
బడసె గరిష్ఠులైతగు భ • వాదృశులెల్లరు మెచ్చునట్లుగన్ ॥

అగ్రజా! నేనొకహితవచనముఁ జెప్పెద. నాలకింపుము.

సు... ఏమి నాభాగ్యము. చిన్నన్నవచ్చి సంగరమునుడిపి యగ్రజుని శాంతున్ జేసి యార్యపుత్రునితో సిటకుఁ దోడ్కొని వచ్చుచున్నాఁడు. ఇఁక నాయలమట తీఱె. బ్రదికితి.

(అంతఁగృష్ణుఁడు బలరామార్జునులతోఁ బ్రవేశించును).

కృ...(అర్జునునితో) అర్జునా! గురువులకడనే నీవిక్రమంబుఁ జూపవలయునా?

అ... దేవా! గురుజనమర్యాద నెఱుంగక నే దురమునకుం దొడంగితిన నికొంటివా? బవరంబువలదని ప్రార్థించితిని. సుంతైన నీయనఘుం డంతరంగంబున శాంతిఁగొనక నన్నాలంబునకీడ్చె.

కృ... అర్జునా? నీవిక్రమంబుఁ బరీక్షింపఁగోరి మాయగజుండిటు నీతో కయ్యంబుఁ గావించెనుగాని నీయందలి యీసునఁగాదు.

[బలరామునితో]

శా॥ అన్నా? చెల్లెలియుల్లమైనఁగనలే ♦ దా? దానినీతోడనే
మున్నే చెప్పఁగలేద? నీవుకినుకన్ ♦ బూనంగలేదా? యెద
ట్టున్నన్ జెల్లెలిముద్దుఁదీర్ప మనకే ♦ యుక్తంబుగాదా? యిఁకే
తెన్నున్ గాంచెదు చెల్లెలీవెయిటులెంతే ♦ నల్కనొల్కించినన్॥

ఇఁక నుత్తరకాలంబున లోకములోఁ బలువురు వలు తెఱంగుల వధూవరుల సేమంబుఁ బాటింపక తమయిచ్చకొలఁది పెండ్లిండ్లు నెఱపుదురు. వారిని వేఱు వేఱుగా నెఱింగించెద వినుము.

ఉ॥ కొందఱుకన్నెలన్ ధనుల ♦ కున్ దగఁబెండిలిసేయఁగోరి యే
మందునకై ననున్ వయసు ♦ మాలినవానికినైన రోగికై
నం దురితైక బుద్ధికయినన్ ♦ గడువేడ్క నొసంగువారలే
మందము వారిచందమర ♦ యన్ విపదాకరమెల్లభంగులన్॥

మఱియొక కొందఱు

మ॥ వరశుల్కంబెదఁగోరి కన్నియలలో ♦ వంశంబుఁ బ్రాయంబు సుం
దరరేఖావిభవంబు శీలమును వి ♦ ద్యాసంపదన్ గాంచకే
గరితన్ గాని నిజాత్మజాతులకు రూ ♦ కల్ జెంది కల్యాణమా
తురులై సేయుదు రట్టిదంపతులకెం ♦ దున్ మోద మింపొందునే?

వేఱొకకొందరు

క॥ బొమ్మలపెండ్లిండ్లనియే
వమ్మొక్కింతేనిఁగనక ♦ వైభవముగ స్త

న్యమ్ముగ భద్రా వెడుకూనల
కిమ్ముగఁ బెండ్లిండ్లుగూర్తు ♦ రిఁకలోకమునన్॥

వెండియుఁ గొందఱు

తే॥ సీ॥ విధవలకు మేటి మేలుఁగా ♦ వింతుమనుచు
గొందఱిమ్ముగఁ బెండ్లిండ్లు ♦ గూర్పఁగందు
రొకఁడు చుట్టినపూదండ ♦ రకము సెడక
యున్న నన్యుఁడు చుట్టఁగా ♦ నుబ్బుఁగొను నె?

ఇంకను బాపభీతిలేని కొందఱు

ఉ॥ బోయఁడు పావురమ్ములను ♦ బోషణచేసి యొకప్డుతిండికై
కోయువిధమ్ముగా ననుఁగు♦కూఁతులఁ దిండికటంచు నెంతయున్
రోయక వృద్ధమూర్తులకు ♦ రూకలకమ్మెదువారు కొల్లగా
నీయుగమెల్ల మాఱు నద ♦ యింతురు పెంతురు పాపసంతతిన్॥

ఇట్లే మఱికొందరు

ఉ॥ కూఁతులనమ్మువారిఁ జెడు ♦ కూళలఁటంచని తిట్టిపోయుచున్
గూఁతులకోలిగాఁ బరుల ♦ కూఁతులనున్ గొని వారిఁ బేర్మమై
భ్రాతకొ పట్టికో తనకొ ♦ భార్యగఁ జేసిఘటింత్రు పెండిలిన్
బ్రాఁతిగ రూకకమ్మ నల ♦ వారికి వీరికి వారయున్న దే॥

వానిని మనము చూడముకదా! మనకేల యాగోల. అన్నా! కుల శీలవిక్రమకలాకౌశలంబుల నారసి వరుసమైన యావిజయుని వరించిన మనచెలియలు మిక్కిలి గణనీయ. విజయుఁడు మనకాప్తుఁడు. లోఁగడ నీవువన్నిన ప్రతినయందునను జెల్లెలిని సుయోధనునకిచ్చెద ననక, కుమనేతకొసంగెద ననుటచే నదియును సార్థకంబయ్యె.

ఇఁక నల్కఁదొలఁగి యీదంపతుల నాదరింపుము,

సు—(సమీపించి) అన్నలకు వందనము.

బ—చిరంజీవ.

కృ—వీరపత్నివైతివి. ఇఁక వీరమాతవగుము.

(తెరలో) తథాస్తు. (సుభద్రతో) అమ్మా! యగ్రజుఁడు నీయందనుగ్ర
హించె. నీయభీష్టం బీడేఱెఁగదా.

సు—(సంతోసంపు సిగ్గునుగాంచును)

బ...[సుభద్రతో, ప్రసన్న భావముతో]

తే॥ గీ॥ తల్లిరో! నీదుబాగుకే ♦ తథ్యమింత
వఱకుఁబూనితి నిపుడీవు ♦ నరునిఁజెట్ట
వట్టు టెంతయుఁ బ్రియమయ్యె ♦ వలఁతి యీతఁ
డభిమతమనోరథార్థంబు ♦ లందుమిఁకను॥

కృ...చెల్లెలా! (నిష్క్రమించును)

చ॥ గరువమునొందకమ్మ చెడు ♦ కాంతలచెల్మినిఁజెందకమ్మ నీ
పురుషుఁడొకప్పుడేనలుకఁ ♦ బొందిన వందురకమ్మ యర్థిమై
గురులనుగొల్వుమమ్మ యను♦గుంజెలియంచు సపత్నులెంచఁగాఁ
జిరముగ సర్వసౌఖ్యములఁ♦జెంది యశంబునుదెమ్మ యమ్మరో॥

[అర్జునునితో] విజయా! మాయన్నగారికి నీయెడ నసూయలేమిఁ
గాంచితివికదా?

అ...(అంజలిఘటించి) దేవా! నిరతము నీయుపకారముచేతనేకదా!
నేనిట్లు కల్యాణంబుఁగాంచి మనుట. ఇపుడు గురునితో నాలము
సేయునన్నుడిపి శాంతిఁబొసఁగించితివి అయిన జగద్రక్షకుఁడవగునీకు
నేమరలఁ బ్రత్యుపకారముఁజేయలేమిఁకిఁ జింతింపక నీయడుగులనే
పూజించెద.

సీ॥ సకలజగత్పుణ్య♦సంధాయకోదక। గంగామహాసరి♦త్కారణములు
ప్రహ్లాదనారద♦ప్రభృతి భాగవతప్ర। శస్తచిత్తాబ్జ సం♦స్థానకములు
మణిపుంజరంజిత♦మహితకాళీయఫ। ణిఫణాగ్రతాండవ♦నిష్ఠురములు
గణనీయదాతృసం♦ఖ్యాముఖ్య బలిదాన। కాలవిష్టపపూర్తి♦కల్పములు

తే॥ గీ॥ బహులదుష్కృతతిమిరౌఘ ♦ భాస్కరములు
సకలకల్యాణకారణ ♦ జనకములు పు

రందరాదిసురార్చనా ♦ రంజితములు
తావకాంఘ్రులకిదియె వం ♦ దనము దేవ!

(సుభద్ర మల్లెవిరులను దోసిలికీయ వానిఁ గృష్ణపాదంబులందుఁ నమస్కరించును)

కృ... చ॥ హరువుగ సల్పినట్టి సమ♦యంబు ప్రియంబుగఁ దీరె బావయున్
గురుఁడును నైతనర్చు యదు♦కుంజరుతోఁ నొనఁగూడెఁ బొందు బం
ధురసుగుణాలవాలయు యదు♦ప్రవరాత్మజయైన మా సహో
దరిసతియయ్యె నీకొకఁడు ♦ దక్కువ లేదయినన్ జయమ్మగున్ ।

(తెరలో) తథాస్తు.

అర్జునా! నీకింతకన్న నేమి ప్రియముగావలెను? ఇంక నిట్లగుఁగాక.

(భరతవాక్యము.)

కవిరాజవిరాజితము॥

గొనకొని కన్నెలు ♦ కోరిన కాంతులఁ ♦ గూర్తురుగా వుతఁ ♦ గూర్మిగురుల
గొనబుగనొండొరు♦లున్ సతులున్ బతు♦లుం జెలువొందుత♦ లోలుపులై
అనువుగ భూతద♦యన్ ఋజుమార్గము♦నందుదురీ ప్రజ♦లందరు నున్
మనుదురుగాత క్ష♦మాపతులెంతయు♦ మచ్చిక నేలుచు♦ మానవులన్।

(నిష్క్రమింతురు.)

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాదాసాదిత కవితాభాసు
రాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర మంత్రారాధ్య
పౌత్ర లక్ష్మ్యంబా వీరభద్రారాధ్యపుత్ర నాగవీరే
శ్వర విరచితంబైన సుభద్రాకల్యాణం
బున షష్ఠాంకము సర్వఁబును
సమాప్తము.



శ్రీపరమేశ్వరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

అచ్చగుచున్నది:

ఆంధ్ర శివమహా పురాణము (పద్యకావ్యము)

ఇది శ్రీవ్యాసకృత సంస్కృత శివమహా పురాణమునకు
నాచేఁదెనుఁగున నొనర్పఁబడిన యనువాదము.

ముందుగా ఆర్డర్లుపంపువారికి వెల తగ్గింపఁబడును.

విలాసము:—

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి,
నెం. 45, సత్యనారాయణగుడి వీధి
శికింద్రాబాదు—దక్కన్.